## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం: 1908

శివలెంక శంభు ప్రసాద్

సంపాదకుడు

[1938 - 1972]

శుక్రవారం: 19-6-'81

దుర్మతినామ సం. జ్యేష్ఠ బ. విదియ

**సంపుటము 74 : సంచిక 40**

సంపాదకుడు:

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60

ఆరు మాసాల చందా రు. 33-80

విడిప్రతి వెల రు. 1-25 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయువాడ-520 003


## విషయానుక్రమణిక



# ఉత్తరాలు

## ముఖచిత్రం

నా అభిమాన నటీనటులు ట్రాజెడీకింగ్ డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు మరియు బ్యూటీ క్వీన్ శ్రీదేవిలముఖచిత్రంతో మా ముందుకొచ్చిన "ఆంధ్ర సచిత్రవారపత్రిక" చాలా అందంగాను,ఆకర్షణీయం గాను ఉంది. ఈ వారం ప్రచురించిన కథలన్నింటిలో "జీవిత రహస్యం" కథ చాల బాగుంది.

చంద్రశేఖర్ దేశాయ్ (ఆదోని)

## కలర్ స్టిల్

సుభాషిణి ముఖచిత్రంతో వెలువడిన 29—5—81 తేది సంచికలో నాకు అమితంగా నచ్చినది 35వ పేజీలోని కలర్ స్టిల్ మురళీమోహన్ జయసుధ. (జయసుధ చిత్రంలో) మీరు ప్రచురించిన అన్నికలర్‌స్టిల్స్‌కన్నా ఇది హైక్లాసుగా ఉంది. దీనినే ముఖచిత్రంగా వేసి ఉంటే బ్రహ్మాండంగా ఉండేది.

ఎస్. అస్గర్‌హుస్సేన్ (గిరింపేట)

## కథలు

నటి సుభాషిణి ముఖచిత్రంలో వెలువడిన 29—5—81 నాటి పత్రికలో "నేనెవరి కోసం బ్రతకాలి" కథ చాల బావుంది. శేఖర్ లాంటి అసు మానవు పిశాచాలున్న ఈ లోకంలో ఇందిరలాంటి వాళ్ళు బ్రతకడం కష్టమే. కాని రచయిత్రి అలాంటి వాళ్ళకు చావే మార్గం కాకుండా మరేదైనా దారి చూపించాల్సింది. "రూపం అందంగా ఉన్నా సరే మనసు వికారంగా ఉండవచ్చు. అలాగని రూపం వికారంగా ఉంటే మనసు అందంగా ఉంటుంది అను కోవడం కూడా పొరపాటు. మీ జంటను చాలా జాగ్రత్తగా పరిశీలించి ఎన్నుకోండి" అన్నట్లుగా యీ కథను ఈ నాటి అమ్మాయిలకు సందేశంగా అందించిన రచయిత్రి శ్యామలారాణిగారికి, ప్రచురించిన మీకు నా ధన్యవాదములు.

గెద్దం శారద (విశాఖపట్నం)

(65 వ పేజీ చూడండి)

## శ్రీ శివలెంక రాధాకృష్ణ విదేశ పర్యటన

ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారు భారత రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి గారితో పాటు విదేశాలలో పర్యటించే నిమిత్తం మే 29 వ హైదరాబాద్ నుంచి బయలుదేరి వెళ్ళారు. వారు జూన్ ఆరవతేదీ వరకు వారం రోజులపాటు కీన్యా, జాంబియా దేశాలలో పర్యటించుతారు.









## సీరియల్

# ఇంద్రసింహాసనం

## సి.ఆనందారామం

(గత సంచిక తరువాయి)

**జరిగినకథ - 10:** వృషపర్వపురానికి చెందిన రాక్షసరాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ అందం, తెలివితేటలు, ధైర్య సాహసాలు కల రాకుమారి. ఆమె, మానవ రాకుమారుడు యయాతి ఇరువురూ ఒకరినివిడిచి ఒకరు వుండలేనంత గాఢంగా ప్రేమించు కొంటారు. యయాతిని కలుసుకొని తమ నగరంపై దేవతల దండయాత్ర ఆపించమని శర్మిష్ఠను వృషపర్వుడు ఆజ్ఞాపిస్తాడు. తమ అనుబంధానికీ, రాజకీయాలకూ తండ్రి ముడి పెట్టడం ఇష్టంలేకపోయినా యయాతిని కలుసుకోవచ్చునన్నభావం ఆమెకు ఆనందం కల్గిస్తుంది. ఇంద్రుడు చేసిన ఘోరాలను సహించలేక సప్తఋషులు అతన్ని పదవీచ్యుతుని గావించి, ఆ స్థానంలో యయాతి తండ్రి నహుషుడ్ని నియమిస్తారు. ఆతన్ని ఏలాగయినా దింపేసి మళ్ళీ ఇంద్రుడ్ని ఆ స్థానంలో నిలబెట్టాలని ఇంద్రాణి శచీదేవి ఆలోచిస్తూంటుంది. ఆమెకు నారదుడు సహాయపడతాడు. అతడు నహుషుణ్ని రెచ్చగొట్టి అగ్ని, వాయు, వరుణ, నిర్రుతులలో పరస్పర కలహాలూ, అధికార దాహమూ రగిలేటట్టు ప్రవర్తిస్తాడు. యయాతి, శర్మిష్ఠలను ఒకటిగా చేస్తుంది ఇంద్రాణి. మహేంద్రుని ఆజ్ఞను ధిక్కరించాడనే నెపంతో జయంతుని యమలోకానికి పంపిస్తాడు నహుషుడు. తనకు అనుకూలుడైన వాడిని యముడి స్థానంలోఉంచి, తన కొడుకును నిర్దోషిగా నిర్ణయించేటట్టు చేస్తాడు నహుషుడు. దీనిని ముల్లోకాల ప్రజలందరూ ప్రతిఘటించడంతో జయంతుణ్నికూడా విడుదలచేయక తప్పలేదు. జయంతుడు భూలోకంలో విమానాల తయారీకి పూనుకొంటాడు. శత్రువర్గంతో చేతులు కలిపి, శుక్రాచార్యుల తపసు భంగం కాకుండా అడ్డుపడిందని ఇంద్రాణిని సభకు రప్పించి, విచారణ జరిపించి అపకీర్తి పాలవుతాడు నహుషుడు. స్వర్గంలో వుండలేక భూలోకానికి వచ్చేస్తాడు యయాతి. దేవయాని దాస్యం నుండి శర్మిష్ఠను విడిపించాలనే ఉద్దేశ్యంతో దేవయానిని వివాహమాడతాడు యయాతి. కాని అతని అంచనాలు తల్లక్రిందు లవుతాయి. దేవయాని శర్మిష్ఠను భూగృహంలో బంధించుతుంది. దేవయానికి శర్మిష్ఠపై గల కోపానికి కారణం యయాతికి చెప్తుంది శర్మిష్ఠ పరిచారిక విమల. ఆ తరువాత శర్మిష్ఠను విడుదల చేస్తుంది దేవయాని, దేవకన్య చెప్పగా.

ఇక రాజులు, శిల్పులు, వ్యాపారులూ, ఒకరితో ఒకరు పోటీలు పడుతూ అగ్నిని ఆశ్రయించటం మొదలు పెట్టారు. రాజులు తమ రాజ పదవిని నిలుపుకోవటం కోసం అగ్ని పాదాల ముందు సంపదలు గుమ్మరించే వారు. అందమైన అమ్మాయిలను కానుకలుగా సమర్పించేవారు. శిల్పులు తాము విశ్వకర్మ వంటి దేవ శిల్పులు కావాలనీ, కనీసం భూలోకంలోనైనా అన్ని కట్టడాల కార్య భారమూ తమకే అందాలని ఒకరితో ఒకరు పోటీలు పడుతూ అగ్నికి అనేక సుందర భవనాలు నిర్మించి ఇచ్చారు. ఇక వ్యాపారులు తాము ద్వీపాంతరాలలో వ్యాపారాలు చేస్తూ కూడా ఆయా రాజులకు కట్టవలసిన సుంకాలు కట్టకుండా అగ్నికి కోరిన కానుకలు సమర్పించి సుంకాల బారినుండి తప్పించుకొనేవారు.

ఏ నోటవిన్నా అగ్నిపేరే! రాజులూ, రాజ్యాధికారులూ, అందరూ అతడి ఆశ్రయం కోసం, అతడి కరుణకోసం పాకులాడేవారే.

అటు అధికారం చెలాయిస్తూ ఇటు విలాసాలు అందుకొంటూ ఆనందంలో ఓలలాడుతున్నాడు అగ్ని.

సురసకు ఈ విషయాలన్నీ తెలిసాయి. ఈమె మహాసురుడనే రాక్షసుడి కూతురు. శుక్రాచార్యుడి శిష్యురాలు. ఈమె బుద్ధి సూక్ష్మతకు మెచ్చుకొని, తన మాయా విద్యలన్నీ ఆమెకు నేర్పాడు శుక్రుడు. ఆ విద్యలలో ఆమె ఆరి తేరింది. ఈమెకు 'మాయ'అని పేరు పెట్టుకొన్నాడు శుక్రుడు. రాక్షస జాతిని వృద్ధి చేయమని ఆమెను ఆదేశించాడు శుక్రుడి ఉపదేశానుసారం మహాసురుడు అందుకు అనుమతి ఇచ్చాడు. ఈమె కశ్యప ప్రజాపతిని ఆకర్షించి, అతడి వల్ల శూర పద్మాసురుడు, తారకుడు, సింహవక్త్రుడు అనే కొడుకులనూ, అజముఖి అనే కూతుర్నీ పొందింది.

పురుషుల్ని ఆకర్షించటంలో అజముఖి తల్లిని మించి పోయింది. సురస అజముఖిని తన భవనానికి పిలిపించుకొని, అగ్ని సంగతి వివరించింది.

"ఈ అగ్ని ఆగ్నేయ లోకాధిపతి వైశ్వానరుడి కొడుకు. అయితేనేం? తండ్రిని తన చిటికెన వేలి చుట్టూ ఆడించగలుగుతున్నాడట! ఇతడి మాట ఎట్టి పరిస్థితుల్లోనూ తండ్రి కాదనలేడట! ఇదంతా పుత్ర వ్యామోహమేనేమో! లేకపోతే ఆ తండ్రీ కొడుకుల మధ్య మరే మంతనాలున్నాయో? ఆ తండ్రి మాత్రం సామాన్యుడా? ఏకంగా సప్తఋషుల భార్యలపైనే కన్నేసినవాడు. అతని భార్య స్వాహాదేవి అడ్డు పడబట్టిగాని... అది సరేలే! ఈ విషయాలు అందరికీ తెలిసినవే! నువ్వు ఈ అగ్నిని వశపరచుకొన్నావంటే, ముల్లోకాలలోనూ మన కెదురుండదు. భూలోకంలో నేను మహారాణిని కావచ్చును."

అజముఖి వెంటనే ఒప్పుకొంది. సహజంగా పురుషులను ఆకర్షించి వశపరచుకోవటం ఆమెకొక క్రీడ. అందులోనూ దిక్పాలకుడి కొడుకు. దేవలోక పాలకుడిని కూడా ప్రభావితం చేయగలిగినవాడు. ఇతణ్ణి ఆకర్షించటానికి మరింత ఉత్సాహంతో ముందు కొచ్చింది.

అజముఖిలో ఆకర్షించగలిగేశక్తి ఎంతవున్నా అగ్నిని కలుసుకోవటం అంత తేలికకాదు ఆమెకు స్వర్గంలో ప్రవేశించే అర్హత లేద భూలోక రాజులు కూడా ఆమెను తమరాజ్యాల లోకి రానీయరు. అంతేకాక, అగ్నినికలుసుకో-

టానికి ఏదైనా నెపం ఉండాలి ఊరికే వెళ్ళి "అగ్ని! నన్ను మోహించు!" అనలేదు కదా!

అగ్ని మహిష్మతీ పురంలో ఉన్న సమయం చూసుకొని అక్కడికి బయలుదేరింది అజముఖి ముందుగా రాజ్యాధికారులను తన ఆకర్షణశక్తితో వశపరచుకొని అగ్ని అభ్యంతర మందిరం చేరుకొంది. ఆమె అద్భుత ఆకర్షణశక్తికి తట్టుకోలేక, చూపులుసృగించి—మాట మరిచి ఉండిపోయిన అగ్నికి విలాసంగా నమస్కరించి "అగ్ని కుమారా! నమస్కారం!" అంది అగ్ని గుటక మింగి పెదవి కదిపి "ఎవరు నువ్వు? ఏం కావాలి?" అన్నాడు చూపులతో ఆమెను తాగేస్తూ. అజముఖి విజయగర్వంతో నవ్వుకొని "మహాదేవా? మా రాజ్యం కరువు కాటకాలతో మునిగివుంది. ప్రజలు అష్టకష్టాలు పడుతున్నారు. తమ రొక్కసారి మా రాజ్యానికి దయచేయాలి" అని వేడుకొంది కప్పింపు స్వరంతో.

"అలాగే! అలాగే! తప్పకుండా వస్తాను" అన్నాడు అగ్ని.

ఆ మరునాడే ఆమెతో బయలుదేరాడు. అజముఖి రాజ్యం అంటోంటే, అదెంత పెద్ద రాజ్యమో అనుకున్నాడు కానీ, అదొక నగరం. అక్కడ వున్న వారంతా అజముఖి బంధువర్గమే! నగరం సువిశాలంగా చక్కని సౌధాలతో వుంది. అందరూ సంపన్నులుగానే కనిపిస్తున్నారు. అగ్ని ఆశ్చర్యంతో "ఇక్కడ కరువు చిహ్నాలేమీ లేవే!" అన్నాడు.

అజముఖి మూతి ముడిచి, "దేవా! అదేమిటి అలా మాట్లాడతారు? ఇక్కడి వారందరికీ, అన్నపానాలకు లోటు లేకపోవచ్చు కానీ, ఇంటికొక విమానమైనా ఉందా? ఏవో భవనాలు వుంటే వున్నాయేమో? చక్కని శిల్ప చాతుర్యం వుట్టిపడే మణులు పొదిగిన బంగారు భవనాలున్నాయా? చంద్రకాంత శిలా వేదికలున్నాయా? క్రీడా శైలాలూ, క్రీడా సరోవరాలూ వీందరి భవనాలలో వున్నాయి? నా భవనానికి రండి. అన్నీ వివరిస్తాను" అంది.

అగ్ని ఆమె వెంట భవనానికి వెళ్ళాడు. మణులు పొదిగిన బంగారు భవనం కాదు కానీ, అది దివ్య భవనమే! ఆమె అగ్నికి కూచోవటానికి హంసతూలికా తల్పం చూపించి, బంగారు పాన పాత్రలో మధువు అందించింది.

ఆ తర్వాత అతి కొద్ది రోజులలోనే అజముఖి బంధువర్గంలో అందరికీ, ప్రతి ఒక్కరికీ విమానం వచ్చేసింది. అందరి భవనాలూ, చక్కని శిల్ప సంపదతో, మణులు పొదిగిన బంగారు భవనాలుగా మారిపోయాయి. అన్ని ఇళ్లలోనూ క్రీడా శైలాలూ, క్రీడా సరోవరాలూ చోటు చేసుకొన్నాయి.

అగ్ని దగ్గర అజముఖి కెదురు లేదనే వార్త అన్ని లోకాలలోనూ వ్యాపించింది. ఈ వార్తకు అజముఖి లజ్జించలేదు సరికదా, సగర్వంగా వ్యాపింప చేసింది.

అజముఖి మాట అగ్ని కుమారుడు కాదనడు, కుమారుడి మాట అగ్ని కాదనడు, అగ్ని మాట నహుషుడు కానీ, ఇంద్రాణి కానీ కాదనరు. అంచేత అజముఖికి అంతులేని ప్రాధాన్యం వచ్చేసింది. అన్ని లోకాలలోని ప్రముఖులూ, తమ తమ కార్య సాధనకై అజముఖి భవనం చుట్టూ ప్రదక్షిణలు ప్రారంభించారు.

సామాన్య ప్రజలు మాత్రం ఈ పరిణామాలకు దిగ్భ్రాంతి చెందారు దిక్కులకులమూ, వారి చరిత్రలనూ అసహ్యించుకోసాగారు. పూజలు చేసేవారు చేస్తున్నా వ్యతిరేకించే వారు ఎక్కువయిపోయారు. పూజలు చేసే వారంతా స్వప్రయోజనాన్ని ఆశించిన వారే!

శుక్రాచార్యుడు తాను కోరినది సాధించ గలిగాడు. దేవతలమీద యుద్ధం ప్రకటించ టానికి ఇది మంచి సమయమని వృషపర్వుడికి



సూచించాడు. వృషపర్వుడు తన బలగంతో దేవలోకం మీదికి దండెత్తాడు.

## 22

ఇంద్రాణి తన అభ్యంతర మందిరంలో గూఢచారిణులైన దేవకన్యలతో సమావేశమయింది. రాక్షసుల దండయాత్ర ప్రారంభమయినప్పటి నుంచీ, ఆమె చాలా అశాంతిగా వుంది. ఒకసారి స్వర్గం రాక్షసుల వశమయితే అరాచకత్వం ప్రబలిపోతుంది. లోకాలుఘూర్ణిల్లిపోతాయి. మళ్ళీ రాక్షసుల చేతుల్లో నుంచి స్వర్గం వశపరచుకోవాలంటే, చాలా ప్రయాసపడాలి. ఎంతకాలం పడుతుందో, ఎవరూ ఊహించలేరు. ఆమె నారదుడి కోసం కబురు పంపింది. ఇలాంటి క్లిష్ట పరిస్థితుల్లో ఆదుకొనేవాడు అతడే!

నారదుడు వచ్చాడు. ఇంద్రాణి అతడికి నమస్కరించింది. "నారద మునీ! ఈ క్లిష్ట పరిస్థితిలో మీరే మాకు దిక్కు. జరుగుతున్నది చూస్తున్నారు కదా? స్వర్గం రాక్షసుల వశం కాకుండా ఏదో మార్గం చూపండి."

నారదుడు కూడా విచారాన్ని ప్రకటిస్తూ "అగ్నిదేవుడి ప్రవర్తన నాకు చాలా వింతగా వుంది. కుమారుడంటే ఎంత ప్రేమ వున్నా, అతడి కారణంగా స్వర్గానికే ముప్పు కలిగే పరిస్థితులు ఎదురయినా, ఎందుకుపేక్షిస్తున్నట్లు?" అన్నాడు.

"అదే నాకూ అర్థం కావటంలేదు. నేను రెండు మూడుసార్లు చెప్పి చూసాను. అర్థం చేసుకున్నట్లే కనిపించాడు కాని, అతడిని శిక్షించటానికి మాత్రం విముఖత చూపడు. గంధర్వ యోధులలో ఎవరినైనా పంపి, అతడిని బంధించవచ్చు కానీ, అది అగ్నితో విరోధం తెచ్చుకోవటం అవుతుంది."

"చాలా మంచిపని చేసారు. మీ వివేకం నాకు తెలియదా? ప్రస్తుత పరిస్థితుల్లో అగ్నితో విరోధం వాంఛనీయం కాదు. అగ్ని కుమారుడు నశించాలి. అది మన ఎవరి ప్రయత్నమూ లేక యాదృచ్ఛికమన్నట్లు ఉండాలి."

"ఆ రకంగా ఈ కార్యం సాధించగలరనే తమను పిలిపించాను."

"ఇందుకు దూర్వాసుడే సమర్థుడు. మిగిలిన మునులంతా తమ తపస్సును ధారపొయ్యటానికి సంకోచిస్తారు. దూర్వాసుడు ఏమాత్రం అక్రమాన్ని సహించడు. దారుణంగా శపిస్తాడు. అతడిని కలుసుకొంటాను."

"ఏదైనా తక్షణం చెయ్యండి నారదమునీ! రాక్షసులు స్వర్గాన్ని వశపరచుకోక ముందే భూలోకవాసులకు దేవతలపట్ల, దేవలోకం పట్ల విశ్వాసం కలగాలి."

నారదుడు దూర్వాస మహాముని తపోవనానికి చేరుకొన్నాడు. నిష్ఠగా తపస్సు చేసుకొంటున్న ఆ ముని కళ్ళు తెరిచే వరకూ సహనంతో నిరీక్షిస్తూ కూచున్నాడు. ముని కళ్ళు తెరవగానే నమస్కరించి, "మహామునీ! తమరే లోకాలను కాపాడాలి" అని క్లుప్తంగా విషయాలు వివరించాడు. నిజానికి ఇలాంటి వ్యవహారాలలో తల దూర్చటం వల్ల మునులకు తపోభంగమవుతుంది వారి ఆత్మశక్తి కొంత క్షీణిస్తుంది. కానీ లోక కళ్యాణానికుపయోగించని ఆత్మశక్తి దేనికనుకుంటాడు దూర్వాస మహాముని.

"ఈ రోజే నేను అజముఖి దగ్గిరకు వెళ్తాను" అని బయలుదేరాడు. ఇక దేవకార్యం పూర్తయినట్లే, అని సంతోషించాడు నారదుడు.

తన ఇంటికి వచ్చిన దూర్వాసమహామునిని చూసి నిస్తపోయింది అజముఖి. పొమ్మనటానికి భయం వేసి "రండి! రండి!" అని ఆహ్వానించింది వినయంతో.

"నీతో కొంత కాలం గడపటానికి వచ్చాను" అన్నాడు సూటిగా దూర్వాసుడు.

"అది నాభాగ్యం" అంది అజముఖి విధిలేక అలా అంది కాని, అంటూ వుండగానే ఆమె గుండెల్లో రాయి పడింది. అప్పటికి అగ్ని ఆమె భవనంలో లేడు కాని, ఏ క్షణంలోనయినా రావచ్చును.

వస్తే ఏమవుతుందో?

అజముఖి భయపడిన క్షణం రానేవచ్చింది. అగ్ని వచ్చి దూర్వాసుణ్ని చూసి నివ్వెరపోయాడు. నమస్కారమయినా చేయకుండా "ఎవడివిరా నువ్వు?" అన్నాడు. దూర్వాసుడు దర్పంగా పడుకొని, కాలుమీద కాలు వేసుకొని, "నువ్వెవడివి?" అన్నాడు.

"నేను అగ్నిని!"

"నేను దూర్వాసుణ్ని."

ఆ పేరు విని అగ్ని ఒక్కక్షణం గతుక్కుమన్నాడు. కానీ అతని అహంకారం వివేకాన్ని మింగేసింది.

"తపస్సు చేసుకునే మునికి ఇక్కడేంపని?"

"ఇదీ ఒక తపస్సే!"

దూర్వాసుడి మాటలు అగ్నికి అర్థం కాలేదు — కోపంగా "ముందిక్కణ్నుంచి కదులు" అన్నాడు.

"నువ్వెవడివి నన్ను ఆజ్ఞాపించటానికి!"

"అగ్నినని చెప్పాను కదా!"

"నువ్వు అగ్నివి కాదు. అగ్ని కొడుకువి. నీకు ఏ అధికారమూ లేదు."

"ఏమన్నావ్? నేను తలచుకొంటే ఏమైనా చెయ్యగలను."

"ఏమీ చెయ్యలేవు."

"ముందు ఇక్కణ్నుంచి కదులు!"

"ఎందుకు కదలాలి?"

"ఈమె నా మనిషి."











REXONA
WITH A BLEND OF FOUR NATURAL OILS
GOOD FOR YOUR SKIN

## ఇంద్రసింహాసనం

తపస్సుతో కృశించిన తన శరీర మంతా కదిలిపోయేలాగ నవ్వాడు.

"ఈమె ఎవరి మనిషి కాదు. ఎవరి స్వాధీనంలో ఉంటే వారి మనిషి. ప్రస్తుతం నా స్వాధీనంలో ఉంది."

"నోటి కొచ్చినట్టు వాగుతున్నావు. బయటికి పోతావా? పోవా ?"

దూర్వాసుణ్ణి చెయ్యి పట్టుకుని మంచం మీదనుంచి క్రిందకు ఈడ్చాడు అగ్ని

ఈ అవకాశం కోసమే ఎదురు చూస్తోన్న దూర్వాసుడు మహోగ్రుడై లేచి "ఛండాలుడా! నన్ను చెయ్యి పట్టుకుని క్రిందకు ఈడుస్తావా ? ఈ క్షణమే పాతాళానికి క్రుంగి నాశనమయిపోతావు" అని శపించాడు.

ముని శాపంతో ఏ అధో లోకాలకు జారి పోయాడో, ఆ తరువాత అగ్ని కుమారుడు ఎవరికీ కనిపించలేదు.

"నేను పోతున్నాను, ఇక నీ యిష్టం. ఎవరిని వశపరచుకొంటావో ?" అని తన కమండలం పుచ్చుకొని అజముఖిని వదిలి వెళ్ళిపోయాడు దూర్వాసుడు.

అజముఖి జీవితంలో మొదటిసారిగా కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. అప్పటి కామె మునివల్ల గర్భవతి అయింది.

అగ్ని కుమారుడికి సంపద అర్పించి పదవులు పొందాలనుకున్నవాళ్ళూ, కామక అర్పించి తమ అకార్యాలు సాధించుకోవాలనుకున్నవాళ్ళూ, కన్నెలను ఎరగాచూపి అధికారం పొందాలనుకున్నవాళ్ళూ, స్వార్థపరులందరూ ఎక్కడి వాళ్ళక్కడ తేలుకుట్టిన దొంగల్లా అణగారిపోయారు. లోకాలకు ప్రళయంలా తయారయిన అగ్ని కుమారుడు నశించాక ప్రజలు కొంత శాంతించారు.

అందరూ అగ్ని కుమారుడు తన అహంకారంతో దూర్వాసుడి శాపానికి గురయి నశించాడని అనుకొన్నారు కాని, ఇదంతా ఒక పథకం ప్రకారం జరిగిందనీ, దీని వెనుక ఇంద్రాణీ, నారదులున్నారనీ ఏ ఒక్కరి ఊహకూ అందలేదు.

### 23

ఇంద్రాణి దివ్య విమానం దేవయాని భవనం ముందు ఆగింది. ఆ విమానంలోంచి దిగి దేవకన్య భవనంలోకి నడిచింది. పరిచారికలు తలలు వంచి స్వాగతం పలికారు.

ఆమె దేవయాని అభ్యంతర మందిరం చేరుకొంది. శర్మిష్ఠ వీణ వాయిస్తోంటే అనాసక్తంగా వింటూ కూర్చొంది దేవయాని. ఎక్కడో దూరతీరాలలో ఉన్న ఎవరినో, ఎలుగెత్తి పిలుస్తున్నట్లుగా ఉంది శర్మిష్ఠ గానం. ఆ కంఠంలో మాధుర్యం, రాగజ్ఞానం, అన్నిటినీ మించి ఆ హృదయంలో ఆర్తి— వినేవారి హృదయాలను గాన ప్రవాహంతో ఈడ్చుకపోతున్నాయి. వీణాగానం చేస్తున్న శర్మిష్ఠ, వింటున్న దేవయాని, ఎవరి లోకాలలో వారు తేలిపోతున్నట్లు మైమరచి వున్నారు.

"దేవయానీదేవికి నమస్కారం" అంది తలవంచి దేవకన్య. ఉలికిపడి తన శోకంలోంచి బయటపడిన దేవయాని దేవకన్యను చూసి ముఖం చిట్లించింది. దేవతలంట్లు విముఖత తండ్రి దగ్గిరనుండి వారసత్వంగా వచ్చింది ఆమెకి. దేవకన్య ఆ తిరస్కారాన్ని లెఖ్ఖచెయ్యకుండా — "మీ అమ్మమ్మ ఇంద్రాణిగారు మిమ్మల్ని స్వర్గానికి ఆహ్వానించారు. మీరు రావటానికి విమానం కూడా పంపారు."

ఈ మాటలతో దేవయాని ముఖం వేయి రేకుల పద్మంలా వికసించింది దిగ్గున లేచి నిలబడి— "అయితే, నేను స్వర్గానికివస్తాను. ఇప్పుడే వస్తాను. కాదు, అలంకరించుకొని వస్తాను. కూచో" అని త్వరత్వరగా తన అలంకరణ మందిరంలోకి వెళ్ళింది. వీణ వళ్ళో పెట్టుకొని కూచున్న శర్మిష్ఠను చూసింది దేవకన్య చిరునవ్వుతో "బిడ్డా! నీకు శుభమవుతుంది" అంది. కొనగోటితో వీణా తంత్రిని విచిత్రంగా ధ్వనింప చేసింది శర్మిష్ఠ! ఆ ధ్వనిలో దుర్భరమైన శోకం ఉంది. దేవకన్య శర్మిష్ఠ దగ్గిరగా వచ్చి ఆమె తల నిమిరింది. శర్మిష్ఠ ఆశ్చర్యంగా చూసింది. దేవకన్య తన స్థానంలో కూచుంది.

దేవయాని అపూర్వంగా అలంకరించుకొని వచ్చింది జరీపని చేసిన కనకాంబరం పట్టు చీర ధరించింది. పగడాలు, పచ్చలు, ముత్యాలు పొదిగిన బంగారు నగలతో అలంకరించుకుంది. పాదాలకు లత్తుక పూసుకొంది, చెక్కిళ్ళకు కుంకుమరాగం అద్దుకొంది. పరిమళ భరితమైన తిలకం నుదుట జ్వాలాకారంలో దిద్దుకొంది. సువాసన ద్రవ్యాలతో నలువైపులా పరిమళించిపోతూ "పద!" అంది దేవయాని అపూర్వసౌందర్యాన్ని జాలిగా చూస్తూ "నీ భర్త అనుమతి తీసుకోనక్కర్లేదా?" అంది దేవకన్య. దేవయాని ముహూర్తకాలం నిలిచిపోయి "అక్కర్లేదు" అని ముందుకు నడిచి విమానంలో కూచుంది.

విమానం గగన వీధులలోకి ఎగిరిపోగానే, శర్మిష్ఠ ముందు వచ్చి నిలిచాడు యయాతి. శర్మిష్ఠతో ఏకాంత సమావేశం కోసం అతడు తహ తహ లాడి పోతున్నాడు. దేవయాని మందిరంలో అతడిని గుర్తించనట్లే ప్రవర్తిస్తుంది ఆమె. ఒకసారి వుద్యానవనంలో ఒంటరిగా కనిపిస్తే పలకరించబోయాడు. వినిపించుకోకుండా పోయి దూరంలో ఉన్న పరిచారికలను కలుసుకొంది దేవయాని పరిచారికా వర్గంలో తన గూఢ చారిణులను కొందరిని ప్రవేశపెట్టాడు అతడు. శర్మిష్ఠ ఏకాంతంగా ఉండే సందర్భం లభించగానే తనకు తెలియజేయమని చెప్పాడు. ఆ గూఢచారిణులు దేవకన్యతో దేవయాని విమానంలో వెళ్ళిపోయిన సంగతి చెప్పారు. పరమానందంతో శర్మిష్ఠ సముఖానికి వచ్చేసాడు యయాతి. అతడిని చూసి శర్మిష్ఠ లేచి నిలబడింది ఆమె సర్వాంగాలూ వణుకుతున్నాయి. అనురాగం

తోనో, అభిమానంతోనో ఆమె ముఖం విచ్చివారింది.

"రాణీగారు లేరు" అంది.

"నేను రాణికోసం రాలేదు. నా రాణి కోసం వచ్చాను." అన్నాడు యయాతి. ఆమెను సమీపించి చేయి పట్టుకోబోయాడు. ఆమె దూరంగా తొలగింది.

"మహారాజా! నేను మీ భార్య మహారాణి దేవయాని పరిచారికను. ఆ విషయం మరచి పోకండి."

"శర్మిష్ఠా! నువ్వు నారాణివి. నారాజ్యం కంటె, దేవయానికంటె అన్నింటికంటె నాకు ప్రియమైన దానివి. ఆ విషయం నీ కింకా అర్థం కాలేదా?"

"దేవయాని పరిచారికగా నన్ను చూసి కూడా, మౌనంగా సహించినప్పుడే, అన్నీ అర్థమయ్యాయి."

"శర్మిష్ఠా! నేను భయపడింది నా కోసం కాదు. నీ కోసమే. దేవయానికి కాదు నేను భయపడింది. శుక్రాచార్యుల కోపానికి! తన కూతురుకి నిన్ను దాసిగా చేసిన ఆ మహాముని నీకు ఇంకా ఏ దారుణమైన శిక్ష విధిస్తాడో నని......"

"ఇంతకంటె నాకు జరిగే కీడు ఏదైనా వుంటుందా?"

"శర్మిష్ఠా! హృదయపూర్వకంగా చెపు తున్నాను, నమ్ము. నేను నీ నగర పరిసర ప్రాంతాలకు వచ్చింది నీ కోసం, నిన్ను వెతుక్కుంటూ కేవలం దయతో దేవయానిని నూతి నుండి పైకి తీసాను. నా మంచితనమే నాకు బంధనంగా పరిణమిస్తుందని ఊహించలేదు."

"దేవయాని మిమ్మల్ని ఎందుకు వివాహం చేసుకుందో, ఇప్పటికీ మీరు అర్థం చేసుకో లేదా?"

"నామీద ఆమెకు ప్రేమ లేదని అర్థం చేసుకొన్నాను. కానీ, నన్నే ఎందుకు పెళ్ళి చేసుకొందో మాత్రం అర్థం కావటంలేదు."

"నాకు తెలును. దేవయాని చాలా తెలి వైనది. ఆనాడు వృషపర్వపుర బాహిరోద్యాన వనంలో మనను చూసినప్పుడే, అనురాగంతో అల్లుకుపోయి, విడివడని మన చూపులను బట్టి మన ప్రేమ గ్రహించి వుంటుంది. అందుకే— నాపైన తన ఆధిపత్యం నిరూపించుకోవటానికి, నన్ను మరింత ఏడిపించ టానికి... మిమ్మల్ని పెళ్ళిచేసుకొంది. కానీ, మీరు... మీరు దేవయానిని ఎందుకు పెళ్ళి చేసుకొన్నారు? మీరే నాకింత నరకం ఎందుకు సృష్టించారు?"

"నీకోసం శర్మిష్ఠా! నిజంగా నీ కోసం! నీవు దేవయానికి ఎందుకు దాసిగా మారావో నాకు తెలియదు. నీకు ఎప్పటికి విముక్తి లభి స్తుందో తెలియదు. నువ్వు ఏమైపోతావోనని భయం వేసింది దేవయానిని వివాహం చేసు కొంటే, ఆమెతోపాటు నువ్వూ హస్తినా పురానికి వస్తావు అప్పుడు దేవయానిని ఏదో ఒక విధంగా ఒప్పించి, నిన్ను విముక్తురాలిని చెయ్యాలనుకొన్నాను కానీ, దేవయాని అసాధ్యురాలు! నా సంకల్పం గ్రహించింది. దేవయాని విషయంలో నేనే నటించానను కొంటే, దేవయాని అంతకంటె గొప్పగా నటించింది."

"అంటే? మీకు దేవయాని విషయం తెలిసిందా? ఆమెకు నామీద ఎందుకింత పగో తెలిసిందా?"

"నిమత అన్నీ చెప్పింది."

శర్మిష్ఠ మాట్లాడలేదు దేవయాని పూర్వ ప్రణయ వృత్తాంతం తెలిసి కూడా ఆ విషయం తనతో చెప్పటానికి ప్రయత్నించని శర్మిష్ఠ ఔన్నత్యం పట్ల గౌరవం కలిగింది యయాతికి.

"శర్మిష్ఠా! ఇంక ఆలస్యం చేయకు. ఆనాడు స్వర్గంలో నీకు దూరమయినప్పటి మంచి నీకోసం పరితపిస్తూనే ఉన్నాను. రా!"

తన బాహువులు చాచాడు యయాతి. శర్మిష్ఠ కదలకుండా అలాగే నిలబడింది.

"శర్మిష్ఠా!"

"క్షమించండి మహారాజా! ఈ విధంగా మీ దాసిని కాలేను. అంతకంటె దేవయానికి దాసిగానే ఉంటాను."

"అలా మాట్లాడకు శర్మిష్ఠా! నువ్వు ఏంచెయ్యమంటే, అది చేస్తాను. నా ప్రేమను శంకించకు—నన్ను మహారాజా! అని పిలవకు."

"ఊహ వచ్చినప్పటినుంచీ నా పైన దేవయాని ఆధిపత్యం అనేక విధాలుగా సహిస్తూ వచ్చాను. రాజకుమార్తెనైన నేను బ్రాహ్మణ కన్య ఆధిపత్యం సహించవలసిన అవసరంలేదు. కానీ, మా తండ్రి 'రాజ్యం— రాజ్యం' అంటూ నన్ను ధిక్కరించనీయలేదు. విధిలేక దేవయానికి తల వంచేదానిని. కానీ అప్పట్లో రాజ్యంకోసం, నా ప్రజలకోసం —

తండ్రిమాట మన్నించి త్యాగం చేస్తున్నాననే సంతృప్తి వుండేది — దేవయానికి దాసిగా మారినప్పుడు కూడా ప్రజలంతా జయ జయ ధ్వానాలు పలికారు. నాపైన పూలవర్షం కురిపించారు అంత పట్టుపట్టి దేవయాని సాధించినదేమీ లేదనిపించింది. ఆమె కంటె నేనే ఉన్నతస్థానంలో వున్నట్టు అనిపించేది. శ. కుడికి భయపడి పైకి దేవయానిని ఏమీ అనలేకపోయినా, ప్రజలందరూ ఆమెను లోలోపల చీదరించుకొనేవారు — నన్నెంతో అభిమానంతో, ఆదరణతో చూసుకొనేవారు. అందుకే నేను పేరుకి దాసినైనా మానసికంగా రాణి నన్నటే ఉండేదానిని. దేవయాని రాలుగాయ తనంతో నన్ను దాసిని చేసుకో గలిగింది కాని, ప్రజలందరి మనోభావాలూ శాసించలేదు కదా? ప్రజల కళ్లలో ఆమె పట్ల ఏహ్యాభావాన్ని తుడిచిపెట్టలేదు కదా! అలా ప్రజల కళ్లలో ఏహ్యాభావాన్ని చూస్తున్న ప్పుడు, అదిచూసి దేవయాని లోలోపల ఉడికి పోతున్నప్పుడు — నేను రాజకుమారి కంటె మహోన్నత స్థానంలో ఉన్న ఆనందం పొందే దాన్ని. దే వ యా ని నా పైన నిజంగా ఆధిపత్యం సంపాదించగలిగింది— నన్ను కించ పరచగలిగింది—మిమ్మల్ని పెళ్లిచేసుకొన్నప్పుడు మాత్రమే!''

శర్మిష్ఠ పసిపిల్లలా ఏడవసాగింది. అప్పటివరకూ శర్మిష్ఠ ఏడవగా చూడలేదు యయాతి. జన్మతః రాజకుమారి కావటం వల్ల ఎంత సుకుమారి అయినా ఏ పరిస్థితు ల్లోనూ బేలపడిపోయేదికాదు.

"ఏడవకు శర్మిష్ఠా! నా గుండె చెదిరి పోతోంది. ఈ వివాహం ద్వారా దేవయాని నీ పైన ఆధిపత్యం పొందటం నిజమయితే కావచ్చును. కానీ, అది తాత్కాలికమే! నా హృదయంలో నీకున్న స్థానం మరొకరికిలేదు. ఎలాగైనా నిన్ను విడుదల చేయించమని ఇంద్రాణిని నేనే ప్రార్థించాను.''

శర్మిష్ఠ తల ఎత్తింది.. కన్నీటితోనేకాక రోషంతో కూడా ఆమె కళ్లు మండు తున్నాయి.

"విడుదల! ఆ విడుదల ఎలా జరిగిందో తెలుసా? దేవకన్యకలు వచ్చి దేవయానితో శర్మిష్ఠను భూగృహంలోబంధించి ఉంచటం వల్ల నువ్వు సాధించిన ఘనత ఏముంది? యయాతి శర్మిష్ఠను చూడాలి. వారిద్దరూ ఒకరికోసం ఒకరు తపిస్తోంటే, నువ్వు నీ ఆధిక్యత నిరూపించుకోవాలి— అని బోధిం చారు. ఇది దేవయానికి వచ్చింది. అందుకే నన్ను విడుదల చేసింది. ఆ అహంభావిని ఇంద్రాణి మాటనైనా సరే, మన్నిస్తుందని భ్రమపడ్డారా?''

"నిజంగా? నాకు తెలీదు?."

"నాకు తెలుసు. అందుకే దేవయాని సమక్షంలో మిమ్మల్ని కన్నెత్తి కూడా చూడ లేదు. ఎంతటి హృదయక్షోభనైనా సహించ గలను. కాని, దేవయాని అవహేళన మాత్రం సహించలేను.''

గంగిగోవులా కన్పించే శర్మిష్ఠలో ఎంత ఆత్మాభిమానం? ఆమె నిర్మల ప్రణయంలో ఎంత నిగ్రహం!








## వెన్నెల పేడు

సాగర తీరంలో సయ్యాటలాడే
చిలకా గోరింకలు
వలపుల పులకింతల్లో మరుడు—
మానభంగాలకోసమే బలిసిన
కబంధ హస్తాల్లో చిక్కిన
మల్లె మొగ్గ కన్నుల్లో యముడు—
ఆమని ఎఱుగని పుంతల్లో
వడిలిన ఆకుల ఎడదల్లో
ఎరగని ఆకలిరేపే అనలుడు—
నాదేశ ప్రగతి పథంలో
నమువర్షం వర్షించే
వన్నెల వెన్నెల పేడు !
మరి ఎన్నడు మారేనో
ఈ మున్నా పున్నమిపేడు !!

— యం. జ్ఞాన సుందర్రావ్

## ఇంద్రసింహాసనం

"శర్మిష్ఠా ! గతంలో నా కారణంగా నీకు కలిగిన క్షోభకు నన్ను మన్నించు. నువ్వు ఎంత క్షోభించావో అంతకంటే నేనూ క్షోభించానని అర్థం చేసుకో! ఇప్పుడు చెప్పు, నీ కోసం — నీ ఆనందంకోసం ఏం చెయ్యటానికైనా సిద్ధంగా వున్నాను."

"నన్ను బాహాటంగా పెళ్ళి చేసుకోండి — మీ రాణిగా లోకానికి ప్రకటించండి."

"అలాగే!" అని కొంచెం జంకుతూ "శుక్రాచార్యులు శపిస్తారేమో కదా!" అన్నాడు.

"మీ ప్రేమ నాకున్నంతవరకూ ఎలాంటి బాధలనైనా ఎదుర్కోవటానికి నేను సిద్ధమే!"

"అయితే నేనూ సిద్ధమే!"

శర్మిష్ఠను తాను వివాహం చేసుకోబోతున్నట్టు యయాతి ప్రకటించాడు. శర్మిష్ఠ చెలికత్తెలే కాక రాజపురుషులందరూ సంతోషించారు.

వివాహ సమయంలో అగ్నిహోత్రాల వెలుగులో వింత శోభతో కళ కళ లాడుతున్న శర్మిష్ఠను చూసి "శర్మిష్ఠ ఎంత అందమైనది?" అనుకొన్నాడు యయాతి. చాలా రోజుల అశాంతి తర్వాత అతని మనసు సంతృప్తితో నిండిపోయింది.

(ఇంకా ఉంది)

# ఫాలాక్షుని డైరీ

## హత్యకిదారితీసిన ధనాశ!

మార్చి 23వ తేదీ రాత్రి లక్నో దినపత్రిక 'పయొనీర్'లో చీఫ్ సబ్ ఎడిటరుగా పనిచేస్తున్న అవదుల్లా సిద్దిక్‌ను-స్నేహితుడు మహేంద్ర ప్రతాప్ సింగ్ అతన్ని కాఫీ త్రాగుదాం రావోయ్ అని పిలిచాడట. ఇప్పుడే తాగానోయ్ అంటే పోన్లే కిళ్లీ వేసుకుందాము రా అని బలవంతాన బయటికితీసుకు వెళ్లాడట. అంతే! ఇరవై నిముషాల్లో అతను శవమై ఆపత్రికఆవరణలోనేపడున్నాడట. అతని గుండెలో రామ్‌పురి కత్తి వెనుకనుంచి [వెన్నులోపోటు] దిగి ఉన్నదట.

ఏమిటీ దారుణం!

పోలీసులు తీగ లాగారు. ఫలితంగా అతన్ని పాన్ [బీడా]కు పిలిచిన మహేంద్ర ప్రతాప్‌సింగ్‌ను అరెస్టు చేశారు. ఆటువుసమలో నేను చీకటిచాటుకు ఒంటేలు పోసుకోడానికి వెళ్లాను. సిద్దిక్ అరుపు విని పరుగెట్టుకొచ్చానన్నా పోలీసులు వినలేదు. ఆనక కొన్ని నిజాలు తెలిశాయి.

సిద్దిక్, సింగ్ ఇద్దరూ కలిసి నవరాత్రిఎడ్యుకేషన్ సెంటర్ అనే పేరాడ పిల్లలస్కూలు పెట్టారట. ఆ స్కూలుకు నీలోఫర్ అనే క్లియోపాత్రా ప్రిన్సిపాలుట. ఆమెతో సింగుకూ, సిద్దిక్‌కూ ఇద్దరికీ ఒకరికి తెలీకుండా ఒకరికి ప్రేమకలాపాలారంభమయి, ఆనకది ఇద్దరికి తెలిసి చిలికి, గాలివానగా మారిందట. వీరిద్దరూ కలిసి ఉదయంసినివాలూ, కొన్ని సాంఘిక, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించగా వచ్చిన డబ్బులలో లావాదేవీలలో మనస్పర్థలొచ్చాయట. సింగ్ ఆ స్కూల్లోని ఆడ టీచర్లను రాజకీయ ప్రముఖులకు ఎర చూపి, ఆనక వారిని తన పనులకు వాడుకుంటూండేవాడట. రాత్రి కాలంలో ఆ స్కూలు భవనం "ఆనంద అద్భుత నిలయం"గా ఉండేదట. సిద్దిక్, సింగూ కలిసి ఇటీవల ఏర్పాటు చేసిన 'నౌషద్‌నైట్' ప్రోగ్రాముకొచ్చిన అమర్‌రజ్వీ అనే వో ప్రముఖ రాష్ట్ర మంత్రి ఆ అసోసియేషన్‌కో లక్ష రూపాయలు విరాళమిచ్చారనీ, ఆ పంపకంలో సిద్దిక్ తనకు తొంభై వేలు కావాలన్నాడనీ దాంతో ఊహా గొడవ లేచిందనీ పోలీసులకువార్తలు దొరికాయట. మంత్రిగారు ఇవ్వలేదన్నారట. ముఖ్య మంత్రిగారు అలాంటిది జరుగుండదన్నారట.

ఇంతకూ సింగ్, చమన్‌లాల్ అనే ఒక వ్యక్తి చేత ఆ రోజు సిద్దిక్‌ను చంపించాడట. పట్టుబడ్డ చమన్‌లాల్ ఊహా విషయం చెప్పి, లొంగిపోయాడట. సిద్దిక్ ఆఫీసు టేబులు సొరుగులలో కొన్ని బూతు బొమ్మలూ, కొందరాడవారి నగ్న ఫోటోలు దొరికాయట. సిద్దిక్ ఆడ పేరుతో కొందరు ప్రముఖులతో ప్రేమ లేఖలు రాసినవి కూడా దొరికాయట. ప్రముఖుల ప్రేమ లేఖలూ దొరికాయట.

34ఏళ్ల సిద్దిక్ ధన సంపాదనలో వక్రగతిని పోడం, ఆ వక్రగతిలో తన భాగస్వామి మహేంద్ర ప్రతాప్‌సింగ్‌తో వక్రంగా పోడమే అతనిమరణానికి కారణాలన్న నగ్న సత్యం, దీని వెనుక రాజకీయ చతురంగముందన్నది మరో సత్యం.

### కాఫీకీ గంజాయికీ తేడా తెలియదా ?!

గంజాయి మొక్కలనుకుని మెక్సికోలో ఫెడరల్ ఏజెంట్స్ పొరబాటుగా పసికాలిపి డబ్బయి వేల కాఫీ మొక్కలకు నిప్పంటించి నాశనం చేయించేశారట.★

## సెప్టెంబర్ 30న మళ్లీ "కొలంబియా" ప్రయోగం!

స్పేస్ షటిల్ యాత్రా కార్యక్రమంలో భాగంగా "కొలంబియా" వ్యోమ నౌక రెండవ ప్రయోగం సెప్టెంబరు 30 న జరుగుతుందని అమెరికన్ వ్యోమ విషయాల అధికారులు చెప్పారు.

ఏప్రిల్ 12-14 తేదీలలో జరిగిన తొలియాత్రలో ఈ నౌక దాదాపు ఆశించినట్టు పనిచేసింది. వ్యోమయాత్రలో కొలంబియా ఎలాంటి ఒడుదుడుకులకు లోను కాలేదు. కీలకమైన యాంత్రిక పరికరాలేవీ చెడిపోలేదు. అందుచేత సెప్టెంబరు 30 న ఈ నౌకను రెండవ యాత్రకు పంపటానికి ఎలాంటి ఇబ్బందీ ఉండక పోవచ్చునని వ్యోమవిషయాల అధికారులు భావిస్తున్నారు.

స్పేస్ షటిల్ "జాతీయ సంపదలో భాగం, ఇదొక అమూల్యమైన సాధనం. దీన్ని భూమి మీద ఉంచటం కంటే ఆకాశంలో విహరింప చేయటానికే మేము కృషి చేస్తున్నాము" అని ఫ్లోరిడా లోని కెనెడీ వ్యోమ కేంద్రం అధికారి జాన్ ప్రెస్‌నెల్ చెప్పారు

కొలంబియా వ్యోమ నౌకను "బోయింగు విమానం" వీపు మీద కూర్చోబెట్టి దేశమంతటా "గుమ్మాడి పండు" ఆటలాగ పర్యటన చేయించి ఏప్రిల్ 29 న కెనెడీ వ్యోమ కేంద్రానికి తీసుకువచ్చారు. ప్రస్తుతం ఈ నౌక రెండవ యాత్రకు సిద్ధమౌతున్నది.

ఆర్బిటర్ ప్రాసెసింగు కేంద్రంలో, ఇంజనీర్లు, కొలంబియా నౌకలో అవసరమైన మరమ్మత్తులు నిర్వహిస్తున్నారు. పరీక్షలు జరుపుతున్నారు. రెండవ యాత్రలో చేయవలసిన శాస్త్ర ప్రయోగాలకు సంబంధించిన సాధన సామగ్రిని అమర్చుతున్నారు.

ఆగస్టు 14 న కొలంబియాను రాకెట్ ఏసెంబ్లీ భవనం దగ్గరకు తీసుకవస్తారు. అక్కడ ఈ నౌకను కొత్త ఇంధన టాంకుతోనూ, రెండు ఘన - ఇంధన రాకెట్ బూస్టర్లతోనూ జత చేస్తారు ఈ పనులన్నీ సజావుగా జరిగినట్లయితే - ఇంధన టాంకు, రాకెట్లతో కూడిన స్పేస్ షటిల్‌ని ఆగస్టు 26 న ప్రయోగ ప్లాట్‌ఫార్మ్ మీదకి తీసుకవస్తారు.

తొలి కొలంబియా యాత్రలో, దీనిలోని కొన్ని సదుపాయాలు సక్రమంగా పనిచేయలేదు. ఇవి, ఎలెవాన్స్, రడ్డర్, బాడీ ఫాప్, స్పేస్ టాయ్‌లెట్ వంటివి ఉన్నాయి. వీటిని తయారు చేసిన పారిశ్రామిక సంస్థలకు, ఈ పరికరాలను తిరిగి పంపటం జరిగింది. రెండవ యాత్రలో వీటిస్థానే కొత్త పరికరాలను అమర్చుతున్నారు. ఉష్ణ కవచాన్ని కూడా మార్చటం జరుగుతున్నది.

కొలంబియాను ప్రయోగించే లాంచింగ్ ప్యాడ్‌ని కూడా మరమ్మత్తు చేస్తున్నారు. ఇప్పటినుంచి, సెప్టెంబరు 30 వరకు జరిగే పనులపై దీని ప్రయోగం ఆధారపడి ఉంటుంది.

# వారఫలం

## 19–6–1981 శుక్రవారం మొదలు 25–6–1981 గురువారం వరకు

మేషం: అధికంగా కష్టించి, అహర్నిశము వ్యాపారాభివృద్ధికి పాటుపడుట లాభదాయకమే. క్రమంగా వ్యాపారం అభివృద్ధికి రాగల సూచనలున్నాయి. వృత్తి ఉద్యోగాలలో మేలున్నది. కొందరకు 'ప్రమోషన్' లభ్యం కాగలదు. స్త్రీలకు : కళారంగంలో ప్రవేశం, తద్వారా లాభం చెప్పదగినవారం. క్రీడా రంగంలో అనుకూలత చెప్పదగినవారం.

వృషభం : వృత్తిలో అధికలాభం, అప్రయత్న ధనలబ్ధి, బంధు సమాగమం, మిత్రగోష్ఠి, ఉత్తరాలమూలాన ముఖ్యవార్తలు అందుకోవటం జరుగుతుంది. ఎదుర్కోవలసిన సమస్యలు ఒకటో రెండో తలఎత్తనున్నవి. స్త్రీలకు: ఉద్యోగంలో నూతనావకాశాలు ఏర్పడగలవారం. క్రీడారంగాను కూలత కొందరకు చెప్పదగినవారం.

మిధునం : అధికాదాయం, వ్యాపారంలోగాని వృత్తిలోగాని, ఆశింప వీలులేదు. మధ్యవర్తుల ద్వారా ఒకానొక విషయం పరిష్కారం కానున్నది. శుభకార్య ప్రస్తావనలకు అవకాశంగలవారం. స్త్రీలకు · శారీరకంగా బాగుండకపోవటం, అశాంతికి వారం ఆకరంగావటం గమనింపనున్నారు. కొందరకు మాత్రం ఉద్యోగ విషయంలో గావించిన ప్రయత్నం ఫలవంతం కాగలదు.

కర్కాటకం : పత్రికా ప్రకటనలో, పరుల కిచ్చిన ధన విషయంలో, క్రొత్తగా ప్రారంభింపబోవు వ్యాపార విషయంలో మీకు మేలు జరుగనున్నది. ఆనంద దాయకమైన వార్త వినగల్గుటయు వార విశేషమే. గ్రహబలం బాగున్నందున యత్న కార్యసిద్ధిగలదని గ్రహించండి. స్త్రీలకు: శుభకార్యాను కూలత, యత్న కార్య విజయం సంభవించగలవారం.

సింహం : గ్రహించండి, ఆరోగ్యలోప ముండగలదు. ఆదాయం అతిశయింపగల మార్గమున్నదిగాని, ఏమి ప్రయోజనం ? అధిక వ్యయం కూడా చేయుగల వారమే. బంధువుల విషయంలో ఆదుకోవలసిన పరిస్థితులుండగలవు. శాంతంగా మీ పనులు సర్దుకొనుట ఎంతైనా మేలు. స్త్రీలకు : సుఖశాంతులు, క్రీడావనిలో ఆదరణ లభించగలవారం.

కన్య : కళా సాహిత్య రంగాలలో ఖ్యాతి లభించే అవకాశమున్నది. ప్రయాణం చేయవలసి వస్తుంది. ఒకవేళ అది వ్యాపార నిమిత్తం కావచ్చు. ఆరోగ్య విషయంలో జాగ రూకత వహించటం ఎంతైనా న్యాయం. కుటుంబ పరిస్థితులందు ఇబ్బందు లేర్పడటం కూడా గమనించగలరు. స్త్రీలకు : నూతన వ్యవహారాలు తెలిసికోవటం, రాజకీయవాదులకు అవకాశాలు చిక్కటం చెప్పదగిన అంశం.

తుల : ఆశ్చర్య జనకమైన ఒకానొక సంఘటన, మీ వ్యాపార రంగాన జరుగనున్నది. ఏవైనా వస్తువులు పోగొట్టుకొంటే, దొరుకగలవనే భోగట్టా కనిపిస్తుంది. మర్యాదగల పరిచయాలేర్పడనున్నవి. ధనాదాయం స్వల్పంగా కనిపించే వారం. స్త్రీలకు: కుటుంబభారం అధికం కావటం ధనాదాయం సన్నగిల్లటం గ్రహింపగలరు.

వృశ్చికం : వస్తుసేకరణకు, వ్యాపారానుకూలతకు, పెద్దలతో పరిచయాలు ఏర్పడుటకు, కళా రంగంలో అవకాశాలు లభించుటకు, అప్రయత్నంగా ఆదాయం సంభవించుటకు ఈ వారం అన్ని విధాలా శ్రేష్ఠమైనది. స్త్రీలకు రచనా వ్యాసంగంలో, ఒకవేళ వ్యాపారంలో సంబంధమున్నవారికి సత్ఫలితాలుండగలవు.

ధనుస్సు : ఆరోగ్య విషయంలో జాగరూకత అవసరం. అనవసరమైన విషయాలలో జోక్యం పుచ్చుకొని, శ్రమకు గురి అయి, వృధాగా కాలాన్ని వ్యయించకండి. బంధువుల తాకిడి కూడా చెప్పదగినవారం, మిత్రగోష్ఠి వలన మేలు చేకూరుతుందిగాని, సంభాషణాక్రమంలో జాగరూకత వహించటం మేలుగదా ! స్త్రీలకు: ఉన్నత విద్యాభ్యాసానికి ప్రాకులాడుటకు, ఉద్యోగంలోనివారు ప్రగతిని సాధించుటకు అనుకూలవారం.

మకరం : ఉత్తరాల మూలాన, వ్యాపార విషయంలో, వివిధ విషయాలు విన గలుగుతారు. సంతాన విషయంలో ఏవో చికాకులు తలయెత్తనున్నాయని గ్రహింపగలుగుతారు. అధికోష్ణత వలన చాలమందికి శారీరకంగా బాగుండదనే చెప్పాలి. స్త్రీలకు: క్రీడావనిలో అనుకోకుండా అవకాశాలు లభించటం, రాజకీయంగా బాగుండుట గమనార్హం.

కుంభం: నూతన ప్రయత్నాలకు ఎలాటి అడ్డంకులులేవు. ఏవిధంగా ఇబ్బంది కల్గుతుందనుకోరాదు. చాల మందికి ప్రయాణ సూచనగల వారం. ఇరుగు పొరుగు వారితో, ఎంత జాగ్రత్తగా ఉంటే అంతమంచిది. ఆదాయాన్ని మించినవ్యయం, కావలసిన వస్తుసేకరణకు అంతరాయం కలగటం గమనించగలరు. స్త్రీలకు: సుఖ శాంతులు లోపించటం పనులు నిర్విఘ్నంగా జరుగకపోవటం కద్దు.

మీనం : అనుకున్న వ్యవహారాలు, హాయిగా ప్రశాంతిగా జరిగి పోతాయి. మిత్రులవలన, బంధువులమూలాన, చెప్పరాని ఇబ్బందులకుగురికావటమే గాక, ధనవ్యయం కూడా చేయనున్నారు, ఆత్మీయుల వలన సంకట పరిస్థితులు ఏర్పడనున్నవి. ప్రయాణాలు చాల మందికి సంభవం. స్త్రీలకు: రాజకీయంగా బాగుండటం, క్రీడారంగంలో విశేషంగా అవకాశాలు లభించటం చెప్పదగిన అంశాలు.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవటం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయం నుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి...**
**కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడర్.






2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

**నైసిల్**
**తెచ్చుకోండి**
**చెమటకాయల**
**బాధ మరిచిపోండి.**



చెమటకాయల పౌడర్ మాత్రమే మీకు దురదలు, మంటల చికాకు నుండి అతి శీఘ్రంగా ఉపశమనమునిస్తుంది.

ప్రత్యేకమైన ఔషధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మ జీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

# లచ్చి

## జగన్మిత్ర



స్ట్రైక్ పీరియడ్లో కూడా, దొంగచాటుగా డ్యూటీలకు వెళ్ళేవాళ్ళలా, తలలు దించేసుకుని, గబగబా గుడిలోనికి దూరిపోయిన, ఓ ఇద్దరు భక్తులు మినహా, శివాలయానికి ఎవరూ రావటంలేదు.

గుడికి కొంచెం దూరంలో, కిళ్ళీషాపు గోడకు ఆనుకుని ఉన్న లచ్చిమి, పావుగంట క్రితమే గుడిలోనికి వెళ్ళిన రాము, అప్పటికీ రానందుకు 'ఇంకా రాడేట ?' అని, అప్పటికి ఓ మూడు మార్లైనా స్వగతంగా అనుకుంది.

'ఆ' విషయం జ్ఞాపకం రాగానే, లచ్చిమి మనసు నిండుగా తీయటి కోరికలు. వాటిని తీర్చమని, దొంగ భక్తుడిలా చేతులెత్తి దణ్ణం పెట్టలేదు. దేవుడే దిక్కున ఉన్నాడో తెలియక, మనసులోనే తన ఇష్టదైవాన్ని ప్రార్థించుకుంది.

అంతలో — టక్...టక్...టక్... లయబద్ధమైన శబ్దం. ఎన్నో ఏళ్ళుగా పరిచయం ఉన్న ఆ శబ్దం తనవైపే వస్తోంది... వస్తోంది... వచ్చేసింది.

'పూజారిగోరేటన్నార్రా ?' మనసులోని ఆత్రుత, మాటల్లో బయటపడుతోంది.

'ఊహుఁ ! నాబం నేదట. పుస్తకంవంతా తిరగేసినాడు.' అలుపు తీర్చుకోవటానికన్నట్టు, చెప్పటం ఆపాడు. ఆ ఆపటం, లచ్చిమికి టెంషన్ను ఎక్కువ చేసింది.

'ఏటీ ? నాబం నేదన్నాడా?' లచ్చిమి మొహంలో మార్పొస్తోంది.

'ఆఁ!... ఇది మూఢంవట. మరో మూడ్నెల్లాగితే, బెమ్మాండమైన లగ్గాలున్నాయన్నాడు.'

ఆందోళన పోయింది. 'మరైతే, నిన్నను ఆల్లీపురంలో పెల్లి బోజనాల కెల్లినాం ?!...' డబ్బున్నవాళ్ళకు లేని మూఢం, పేదవాళ్ళకు, అందునా — వాళ్ళకోసమే వచ్చినందుకు లచ్చిమి ఆశ్చర్యపడింది.

రాము లచ్చిమి మొహంలోనికి చూశాడు. పొంగే పాలల్లో నీళ్ళు చిలకరించినట్టుగా... తను అలా చెప్పగానే, ఆమె మొహంలో ఉండే సంతోషమూ, కళా మాయమైపోయాయి.

'లచ్చీ !' పిలుపులో ఆప్యాయత. 'నిన్నూ, మావయ్యా మరో మూడ్నెల్లు దూరంగా వుంచి, మీ వుసురు నేనోసుకోలేనే. ఈ ముక్కే పూజారి గోరితోటన్నాను.'

లచ్చిమి ఏమీ మాట్లాడటంలేదు. రాము భుజంమీద చేయి వేసి, మౌనంగా నడుస్తోంది.

'లచ్చీ !'

'...............'

'పెల్లి ! ఈ మాత్తరం దానికే, ఏడుపు మొకఁవెట్టేడఁవెందుకూ ? ఆఁ! ... పూజారి గోరేటన్నారంటే ... ఇదిగో ... '

'నాకేటి సెప్పొద్దు నేరా.'

'అంత కోపఁవైతే ఎలాగమ్మా ? మరీ ... పూజారిగోరు రేపాదిలీమన్నాడు. ఎల్లుండి సేసీమ కొమ్మన్నాడు ... పెళ్ళి ... మంచి లగ్గఁవట !' ఆ మాట చెప్పిన రాము మొహం, అడుక్కునేవాడి బొచ్చెలోని ఇచ్చ రూపాయిలా మెరిసిపోతోంది.

తనకు ఇష్టమైన మాటను విన్న లచ్చిమి - పేదోళ్ళకు ఒళ్ళంతా జలదరించకూడదనే రూల్ రాలేదు కాబట్టి, ఆ అనుభూతిని తనూ పొందుతూ, ఇంతసేపూ తననేడిపించినందుకుగానూ, మూతి సున్నాలా పెట్టి చిఱుకోపం చూపిస్తూ, రాము భుజాన్ని గట్టిగా గిచ్చింది. అలాంటి సందర్భాలు వాళ్ళకు చాలా అఱుదు. అందుకే, రోడ్డమ్మట పోయేవాళ్ళు ఏమనుకుంటారోననే బిడియం లేకుండా, ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు.

అంటే — ఎల్లుట, మంగళ వాద్యాల మధ్య, పట్టు పీతాంబరాలతో, పురోహితుల వేద ఘోషతో లచ్చిమికి పెళ్ళి జరుగుతుంది—అని మీరనుకోవద్దు. అలా జరుగదు. జరక్కూడదు.

ఎందుకంటే — లచ్చిమి మనువు అప్పన్నతో నిశ్చయమైంది. అప్పన్నంటే డోలక్ వాయించి, పబ్లిక్ను ఎంటర్టైన్ చేస్తూ, వాళ్ళు పడేసిన దాంతో, కొంతలో కొంత కడుపుమంట చల్లార్చుకుంటున్న నిర్భాగ్యుడు. మన భాషలో ముష్టివాడు. అందుచేత — వాళ్ళిద్దరి పెళ్ళీ, పార్కులోని గోడ ప్రక్కగా, ఓ పదిమంది ముష్టివాళ్ళ సమక్షంలో, జరిగిపోతుంది. వాళ్ళుకూడా వస్తారో, రారో

చెప్పలేం. సన్యాసీ, సన్యాసీ రాసుకుంటే...సామెతలా, వీళ్ళ పెళ్ళికి వాళ్ళొస్తే, వాళ్ళ కడుపు ఆ రోజు ఖాళీయే !

పెళ్ళికి ఏవేవి కావాలో మాట్లాడుకుంటూ, మాటల మధ్యలో నవ్వుకుంటూ, హుషారుగా నడుస్తున్నారు. ప్రక్కరోడ్‌లో, గొడవగా వినిపించటంతో, రాము మాటలు ఆపేసి, 'లచ్చీ, నిలబడు. నీలామాలు దగ్గిరి సూసొత్తాను' అంటూ, అటుగా వెళ్ళాడు.

లీలా మహల్లో క్రొత్తసినిమా రిలీజ్. గేట్లు మూసి ఉన్నాయి. రేషన్ డిపోకన్నా అధ్వానంగా ఉందక్కడి పరిస్థితి. ఓ ప్రక్క మొబైల్ స్వీట్ స్టాల్స్, ఐస్ క్రీం, వేడి బఠానీలవాళ్ళు — అపుడే గేట్లు తీయించి, మా పొట్టలు కొట్టకు మహాప్రభో అని, థియేటర్ యజమానితో మొఱ పెట్టుకుంటున్నట్టుగా, ఒకటే అఱుస్తున్నారు, వర్షాకాలపు కప్పల్లా !

రాము స్టీల్‌బోర్డ్‌వైపోమారు చూసాడు. 'ఎ' అని రాసున్న ఇంగ్లీషు అక్షరం అర్థం కాలేదుగాని, ఆ అక్షరం క్రింద — బొట్టు సగం చెఱిగి, అస్తవ్యస్తంగా ... పడుకుని ఉన్న ఆడది ! రాముకు అర్థమైపోయింది, ఆ సినిమాకు జనం బాగా వస్తారని !

'బాబూ ! మేట్నీ వొదిలీసారేటి ?'

చలికాలం. అసలే బేరాలు లేవు ... 'ఏం ? ఏటంత తొందరగుంది ? మాం రెండైసు ముక్కలమ్ముకోడం, నీ కిస్టం లేపోతె సెప్పు...పాస్పరైట్రు గారితో సెప్పెసొస్తాను, ఆట బేగె వొగ్గిమని ... నేకపోతే, ఇంకా అయిదేనాగానేదు, అపుడే ఈఁడికోసం ఆటొదిలియ్యాలట !! మొకం జూడు, ఇరిగిపోయినైసుముక్కలాగ,' అంటూ రామును కసురుకుని, మరలా 'పాలైస్, నిమ్మైస్, కోనైస్' అంటూ, అఱుపుల్లోనికి వెళ్ళిపోయాడు.

'నాను పెబాతు కెల్తాను. మారుకట్టు కాసెల్లి, మాఁవ అగుపడితే తీసుకొస్తాను.' లచ్చిమిని, లీలా మహల్ రెండో గేటు దగ్గఱ కూర్చోబెడుతూ, ఆమె ముందర, ఓ నల్లటి గుడ్డను పఱచి, 'వొచ్చీదాకా జాగరత' అంటూ తగ్గు స్వరంలో హెచ్చరించి, కఱ్ఱ టక టక లాడిస్తూ వెళ్ళిపోయిన రాము, ఆ కఱ్ఱను వాడేది, రావుబహద్దూర్‌లా స్టైల్ కోసం కాదు. అతని ఎడమ కాలూ, ఎడమ చేయీ పనికిరాకనే !

లచ్చిమి తన చేతులతో, ఓ మారు తన కడుపునింపే గుడ్డనూ, మానాన్ని కాపాడే పవిటనూ సర్దుకుని, ఓ నిమిషంపాటు, మట్టూరా ఉన్న వాళ్ళను, తనపై కనికరం చూపించమన్నట్టు, రెండు చేతులూ జోడించింది. తర్వాత గొంతు నోమారు సవరించుకుని, 'జాలిలేని బ్రమ్మయ్యా... బదులు పలకవేమయ్యా' అంటూ పాడటం మొదలు పెట్టింది.

లచ్చిమికి పదహారేళ్ళుంటాయేమో ! ఆమె కోసం పోలి — అంటే — స్వంత తండ్రిగా చలామణి అయిన — పెంపుడు తండ్రి, ఎనిమిది సంవత్సరాల లచ్చిమిని, ఏకాకిగా చేసిపోతూ, ఆమెకై ఏమీ మిగల్చలేదు. ఎందుకంటే — పోలి రెవెన్యూ డిపార్ట్‌మెంట్ క్లర్కూ కాదు, పోనీ బిజినెస్ మేగ్నెటూ కాదు. ఒట్టి ముష్టివాడు.

తీయటి గొంతుగల లచ్చిమి గుడ్డిది. పుట్టుకతో గుడ్డిది కాకపోయినా, ఆ శనివారంనాటి రాత్రి, వెంకటేశ్వరాలయం నుండొస్తున్న పోలికి, కన్నె మరియమ్మ కొండవఃలుపులోని పాడుపడ్డ పాకలో, పసిగుడ్డు ఏడుపు. ఏ తల్లి పాప ఫలమో ... ! చుట్టూ చేరి, వాసన చూస్తున్న కుక్కల మధ్యనుండి తీసుకున్నాక, ఈ రాజ్యంలో తనూ, ఆ పిల్లా సులువుగా బ్రతకటానికని... !!

ఏమైతేనేం — లచ్చిమికి కళ్ళు లేకపోవటం, ఒక విధంగా ఆమె అదృష్టమనే చెప్పాలి. అదే ఆమె చేస్తున్న ఈ సెల్ఫెంప్లాయ్మెంట్ స్కీముకు, పెట్టుబడి అయింది. రోజూ, ఆ అన్న కాని అన్న, ఈ సెల్లి కాని చెల్లిని, వాళ్ళు తలదాచుకుంటున్న, పాడుపడ్డ రైల్వే పార్కు నుండి, టౌన్లోనికి తీసుకు వస్తాడు. అదృష్టం బావుంటే అన్నం... లేకపోతే ఆకలీ... మామూలే !!

పాడుతున్న గుడ్డిదానిచుట్టూ, అక్కడున్నవాళ్ళే కాకున్నా, దారినపోయేవాళ్ళూ మూగుతున్నారు.

'నువ్వూ ఒక మనిసైపుడితే... నాలాగే నీ కనులుంటే...'

> **అడుగడుగునా ....**
>
> ''చెంచాలు''<br>
> ఇంట్లోనే కాదు<br>
> బయట కూడా వుంటాయి<br>
> ప్రతి పెద్ద కుర్చీని<br>
> నాకుతూంటాయి<br>
> కుక్కలు కావు<br>
> కనీసం వాటికి<br>
> విశ్వాసమయినా వుంది.
>
> — ఎస్. మునిసుందరం

'అయ్యా ! అనాదను. దరమం సెయ్యండి బాబూ. కబోదిపై కనికరం సూపండి నాన్నా, అన్నియ్యా...' అంటూ, పాడే పాటను మధ్య మధ్య ఆపుతూ, అర్థిస్తోంది.

చేరినవాళ్ళలో కొందరికి, ఆమె పాడే పాట వినిపించటంలేదు. ఆమె పొంగులు మాత్రమే కన్పిస్తున్నాయి. మరికొందరు — పెళ్ళినాటి రాత్రే, లైట్లు తీసేసిన పెళ్ళి పందిర్లా — కళా విహీనంగా ఉన్న, ఆమె అందమైన మొహం చూసి, జాలి పడుతున్నారు. మిగిలినవాళ్ళు, లచ్చిమి తీయటి గొంతునుండి వచ్చే, ఏడుపు పాటలని విని, ఆనందిస్తున్నారు.

బ్లాక్‌లో అమ్ముకోవటానికి టిక్కెట్లివ్వని, హాలు మేనేజర్‌ను బూతులు తిట్టుకుంటూ, లీలామహల్ వైపు వస్తున్న శీను, టర్నింగ్‌లోనే ఆగిపోయాడు. తిట్టడం మానేసి, చుట్టూ ఓ మారు, రాము అలైన్ సాట్లోడి కోసం చూసాడు. 'సొట్ట ఎదవ లేడు' స్వగతంగా అనుకుని, లచ్చిమికి దగ్గఱగా వస్తున్నాడు.

తొందరపడి వచ్చేస్తున్న శీతకాలపు చీకటిని థియేటర్ దగ్గరకు రానిచ్చే ఉద్దేశం లేనట్టు, హాలు బయటి లైట్లు ఒక్కమారుగా వెలిగాయి. ఆ వెలుగులో — నల్లటి గుడ్డమీది ఐదు, పది, పావలా నాణాలు — చీకటిలో మెఱిసే పొడపాము కళ్ళలా - మెఱుస్తున్నాయి.

ఓ అరనిమిషంపాటు, లచ్చిమి ఎత్తు గుండెల పైనా, నల్లటి గుడ్డమీది తెల్లటి డబ్బుల పైనా, వాల్‌క్లాక్‌లోని పెండ్యులంలా అటు ఇటూ కాకున్నా, పైకీ క్రిందికీ తిరిగాయి — ఆ కళ్ళు...శీను కళ్ళు... ఆ కళ్ళల్లో కసి !!

ఆ 'కసికి' కారణం — సరిగ్గా రెండేళ్ళ క్రితం...

'ఏటత్తా ! పైటొదిలీసి కూకున్నావు ! బేరాల్లేవేటి ? ?' పళ్లెంలోనుండో కొబ్బరిముద్దను తీసుకుంటున్న వ్యక్తి వైపు చూసిన రంగమ్మ, గబుక్కున డబ్బుల సంచీ మొలలో దోపుకుని, దానిమీదుగా చీర కొంగును సర్దుకుంటూ, మొహాన్న బలవంతపు నవ్వు పులుముకుని, 'ఏట్రా అల్లుడూ ! బాగున్నావా ?' అడిగింది.

'ఆఁ ఆఁ...రాయుర్తియ్యి. మందుకుబోవాం.'

'ఏటోరా. తిర్నాదుఃసోవి రతం (త్రినాధ వ్రతం)లోని, బేపనోడి కత ఇన్నావా ? అతగోడు రెల్లి పెట్టెక్కి, ఎన్ని పైసాలు తెంపినా, కడకి మూడు పైసాలే మిగిలినయ్యట. నా పనీ అలగ్గే వుందిరా. ఏటో గాచ్చారం ... ఎంత కస్టపడ్డా, మూడు మిగలసడం గగనంగుందిరా.' మామూలు ఇవ్వకున్నా, ఎలాగోలా ఆ రౌడీ పీడఒదుల్చుకోవాలని, ఏదేదో చెప్తోంది.

'అత్తా ! ఆపావు. తిర్నాదుల రతం మనకు తెల్దుగానీ, నీ మొకానికి మూడు సాలవా ? ... ముసలైపోయినా ... పయిటొదిలీస్తే, పది మిగిలిపోతాయనుకున్నావేటే ? ఆఁ ... !'

శీను మాటలకు రంగమ్మ వికారంగా నవ్వి —

'అది కాదురా. ఇయ్యాల్టిదీ, రేపిటిదీ రేపిచ్చెత్తాన్రా.'

'ఏసా లెయ్యకుండా బేగె అంపించే' అంటూ, ఇంకా ఎవరెవరి దగ్గఱ మామూల్లు వసూలు చెయ్యాలో చూడటానికై, హాలు గేట్లవైపు చూసాడు.

దూరంగా, గేటు ప్రక్కన ... లైట్ల వెలుగుల్లో ... శీను కళ్ళు వెడల్పు చేసుకు మరీ చూసాడు. 'ఆ గుంటే ! లచ్చిమి !!' ఆ మాటే రంగమ్మతో అన్నాడు.

'అవున్రా ! నీ కళ్ళు దానిమీద వొడ్డాయేట్రా?!'

'అదచ్చంగా నీ పెద్దకూతుర్లాగుందే ... ఎవుడైనా సూడ్డం మానేస్తాడేటి ? ... అగ్సరే, అదెపుడలగైపోయింది ?' శీను రంగమ్మవైపు చూడటంలేదు. దృష్టంతా లచ్చిమిమీదనే. పాత లంగా, పాత జాకెట్టూ, క్రొత్తవోణీ ... లచ్చిమి చేతుఃు ప్రతిసారీ, వోణనే సర్దుతున్నాయి.

'ఏదీ — ఇయ్యాల్టికి నెలగాలేదు. కొత్త గుంట ... బెదరగొట్టెయ్యకురోయ్' ఆ మాటల్లో కవ్వింపు.

'గుంటవ్వాడే గుర్రం నగుంది ... దానా ఏటి

తింటాదోగాని' చౌక రకం ఫిల్టర్ సిగిరెట్ వెలిగించాడు.

'అత్తా ! ఈలందరి దగ్గిర, నువు మామా లొసూలు సేసిపెట్టు. ఎవులైనా ఆఁ ఊఁ అంటే, నన్ను సూపించు. దావ్నోమారు పలకరించి ...' అంటూ శీను లచ్చిమి వైపు నడిచి, ఆమె మొహంలోనికి పొగ ఊదేడు. పీలుస్తున్న శ్వాసలో, గాలితోబాటు పొగ వాసన !

'ఎవులూ ?' లచ్చిమి అడిగింది.

'నేనూ... శీను మామిఁయుని. బాగున్నావా ?'

'... ... ... ...'

'నా దగ్గిరి సిగ్గెందుకే ? నిన్ను జూసి నెల్లైంది. అవునూ... ఏటిలగైపోయిందట ? ఆఁ... ఎపుడు జరిగిపోయిందేటె ంఁహా గోరం ?!' పకపకా నవ్వు.

'ఏట్లైందీ ?' అమాయకపు లచ్చిమి.

'ఓస్ ఏటో ! మళ్లీ నా నోటే ఇనాలని నీ సరదా !!' మరలా అదే నవ్వు.

లచ్చిమికి అర్థమైపోయింది. ఆమె మొహంలో ప్రసన్నత స్థానే, కోపం, అసహ్యం...

'ఏం... ? పలకవేటే అమ్మోర్లాగ ! ఆ కొత్త పయిట, బూరిబుగ్గలూ, ఆఁ... మరీ... నాకు బువ్వెపుడెడతావే ? ఈ రాతిరికా ? రేపు రాతిరికా ?'

లచ్చిమికి ముక్కుపుటాలూ, పెదవులూ అదురుతున్నాయి.

'ఏటలగైపోతన్నావేటే ? కొత్తలో అందరూ అంతే. బయపడక. తొందరేంలేదుగానీ... ఇయ్యాల రేపు ఆగి, కొంచం సర్దుకున్నాక... ఆఁ... మీల్సు పెట్టు. నువ్వెడతావులే... నాకు తెలుసు.' పారేసిన సిగిరెట్ పీకను కాళ్ళతో ఆర్పటానికై క్రిందికి చూసాడు.

మాటల శబ్దాన్నిబట్టి, శీను తన ఎదురుగనే ఉన్నాడని ఊహించిన లచ్చిమి, కాండ్రించి... ! ?

ఊహించినట్టుగనే, శీను మొహం అసహ్యంగా... చి...ఛీ... !!

అనుకోని సంఘటనకు, శీనులోని అహం, దుర్మార్గం, రౌడీయిజం అన్నీ బుసలు కొట్టాయి. అంతే — లచ్చిమి రెండు చెంపలూ అదిరిపోయాయి. లచ్చిమిని తన చేతుల్లోనికి తీసుకున్నాడు. మరో రెండు నిమిషాలాగితే, ఆమె ఏమయ్యేదో... కాని, అపుడే సినిమా వదలడం, అంతా చేరి శీనును కంట్రోల్ చేయటం జరిగిపోయింది. అలా లచ్చిమి బ్రతుకు... బ్రతికిపోయింది.

'ఎలాగైనా గుడ్డి గుంట పొగరణచాల' కక్షతో ఆనాడే పగబూనాడు సైంధవుడులాంటి శీను.

'ఛత్ ! దాన్రోజులు బాగున్నాయి. నేకపోతేటి ? అపుడే సెట్టిబాబొచ్చి ఆరబరునుండి పూరియా బస్తాలు తెమ్మండంవూ అలగే, రోజులు బాగునేక దొరికిపోడంవూ అలగే. నేకపోతే ఆ రాతిరే సొట్టోడికి నాలుగు తగిలించేసి, దీన్ని కొబ్బరి తోటలోకి నాగించేసుందును. నా టైం బాగోనేదు. సరే ! ఎద్దొపుడూ ఓ పక్కే తొంగోదు గదా — అపుడు నా టైం బాగునేదు. ఇపుడు దీని టైం బాగునేదు. ఒక్కర్తీ దొరికింది. గుంట ఈ రెండు సమచ్చరాల్లోనూ, ఎంతేపుగెదిగిపోయిందీ !! ...



మీల్సు చేసెయ్యాల ...' ఎదురు కిళ్ళీషాపు దగ్గఱ నిలబడి, ఆలోచిస్తున్న శీనుకు తను కాలుస్తున్న సిగిరెట్‌తోబాటు, ఆలోచనలూ ఆగిపోయాయి.

'సత్తిన్నా ! ఓసార్మినారు పెట్టెలగియ్' అంటూ, షాపు ఓనర్ వైపు తిరిగాడు.

మేట్నీ ఒదిలేశారు. స్కూల్లో, సెక్సుపాఠాలు నేర్చుకున్నంతగా, సంతోషపడే విద్యార్థుల్లా, బిలబిల మంటూ బయటికివచ్చే వాళ్ళనూ, వెనుకబడితే, ఆ సంతోషం తాము పొందలేమేమోనన్న ఆత్రుతతో, లోనికి దూసుకుపోతున్న వాళ్ళనూ చూస్తుంటే, మేకప్‌లేని కురు పాండవ సైనికుల్లా ఉన్నారు. ఆ అలజడికి భయపడి మొత్తంగా గుడ్డతో డబ్బులు తీసుకుని, గుడ్డిది ఒదిగి నిలబడింది.

ఫస్ట్ షో ఇంటర్వల్. స్టాల్సువాళ్ళ రొద పెరిగింది. ప్రేక్షకులు హాలు బయట పచార్లు చేస్తున్నారు. వారికి నచ్చిన అందాల్నీ, ఒంపుల్నీ, డైరెక్ట్‌గా చూడటం అసభ్యం అని, సభ్యత ముసుగులో 'వాటిని' చూస్తూ, కుర్రకారూ, ముసలికారూ ఆనందపడిపోతున్నారు.



అవేవీ గమనించ వీలుకాని లచ్చిమి, వీలు కల్పించని దేవుళ్ళను తిడుతూ, పొగడుతూ పాటలు పాడుతోంది. డబ్బులనోమారు చేతులతో తడిమి, 'బాగా దొరికినాయి' అనే ఆనందంతో, ఉల్లాసంగా పాటలు పాడుతూ, మధ్య మధ్య మరో మారు--మరో మారు 'గుడ్డిదాన్ని, అనాధను ధరమం బాబూ' అంటూ, అర్థిస్తోంది.

లోపలినుండి బెల్ వినిపించగనే, టీకాల డాక్టరును చూసి, ఇంట్లోకి పరుగెత్తే పిల్లల్లా — అందరూ హాల్లోనికి వెళ్ళిపోయారు.

శీను లచ్చిమి ప్రతి కదలికనూ పరికిస్తూ, అవకాశం కోసం పొంచి చూస్తున్నాడు.

డబ్బులను 'చిక్కాం' అనబడే చిన్న సంచీలో వేసి, మొలను దాచేసుకు నిలబడి, ఎల్లుట జరిగే పెళ్ళి గురించి ఆలోచిస్తోంది. పెళ్ళి...అప్పన్న...!! ఆ గుప్పెడు మనసులో, గంపెడు గుప్తమైన కోరికలు. అంతలో — చిన్న చిన్న చినుకులు. అలిసిన ప్రాణానికి హాయిగా ఉంది.

చినుకులు చిక్కనౌతున్నాయి. భోయ్‌మనే శబ్దంతో గాలి. ఆ మూలనెక్కడో పెద్ద మెరుపు. వెంటనే అంతా అంధకారం. స్టాల్సువాళ్ళు వర్షానికి కాకున్నా, విసురుగా వీస్తున్న గాలికి భయపడి చెదిరిపోతున్నారు.

జనరేటర్ సహాయంతో, సినిమా మద్దత్తుతో సినిమా నడుస్తూనే ఉంది, తన చుట్టూ కాంతి దీపాలను కాపలా ఉంచుకుని !

లచ్చిమి పవిటను తలపై వేసుకుంది. కొన్నాళ్ళ క్రిందటి ఇండియన్ ట్రైన్స్‌లా, సొట్టోడు ఎంతకూ రాలేదు. 'ఈ వరసంలో ఆడు మాత్రం ఎల గొస్తాడు ?' అనే ఆలోచనతోనే, 'బాబూ !' అంటూ పిలిచింది.

'...............'

వర్షంలో తడవకున్నా, నిలుచోటానికి ప్రక్కన ఎక్కడికైనా తీసుకువెళ్తారేమోననే, ఆశతో పిలిచింది. బదులు లేకపోవటంతో భయపడిపోయింది. గేటు లైట్ల వెలుగుల్లో లచ్చిమిని పరిశీలిస్తున్న ఆ రెండు కళ్ళకూ మహానందంగా ఉంది. పంజా విసరాలనే ఉంది. కాని... తన ప్రక్కగా ఇంకా పది పదిహేనుమంది వరకూ, వర్షానికి తడవకున్నా ఆగిపోయారు. అందుకే తనూ ఆగిపోయాడు.

చూస్తుండగనే వర్షం కుండపోతగా మారి పోయింది. వాయుదేవుడికీ, వానదేవుడికీ గుడ్డిదాని మీద కనికరం కూడా లేదేమో ! ? రాళ్ళు విసురుతున్నట్టుగా వడగళ్ళు !

పార్క్ జంక్షన్ నుండి ఉండి — ఉండి బస్సో, లారీయో వస్తున్నాయి. లచ్చిమి పూర్తిగా తడిసి పోయింది. వెచ్చగా టీ త్రాగాలనే ఆశ ! అటుగా వెళ్తే, బరమా రంగడి టీ స్టాలుందని తెల్సు. మొండిధైర్యంతో బయల్దేరింది. అడుగులో అడుగు వేసుకుంటూ నత్తలా నడుస్తోంది. కాళ్ళు నీళ్ళల్లో నానిపోతున్నాయి. ప్రక్కనుండో లారీ, నీళ్ళు చిమ్ముకుంటూ ఁయ్ మంటూ వెళ్ళిపోయింది. కాళ్ళను తాకుతూ చెత్తా, డబ్బాలూ, వేగంగా ముందుకు పరుగిడుతున్నాయి. క్రమేపీ, హాల్ లైట్లు విసిరే వెలుగులు దూరం అవుతున్నాయి.

శీను, తనకు అనువైన ఆ ఖాళీ స్థలం చేరేవరకూ, లచ్చిమిని నడువనిస్తున్నాడు.

ఎక్కడో పిడుగుపడ్డ శబ్దం. అర్జునా, పాలుగునా... లచ్చిమి గుండెలమీద చెయ్యి వేసుకుంది. పాపం ! అంతటి భయం.

శీను వెంబడిస్తున్నాడు.

మెఱుపు... పెద్ద మెఱుపు. లచ్చిమికి కాదు. కళ్ళున్నవాళ్ళకైతే మిఱుమిట్లు గొలిపే — మెఱుపు. ఆ సెకెనులోనే, ఆ లిప్తలోనే, ఆ వెల్తుర్లో లచ్చిమి వొంపులు, తడిసి శరీరానికి అతుక్కుపోయిన బట్టలు, ఎత్తుగుండెలు — జానపద సినిమాల్లో చూపిస్తారే — అలా — జలకాలాడటానికి ఏ దేవతో, సరస్వతి జంక్షన్‌కే వచ్చినట్టున్న, లచ్చిమి శరీరాన్ని ఆ మెఱుపు వెలుగుల్లోనే కళ్ళతోనే తడిమేశాడు శీను !

ఆ 'అందానికి', అంతటి చలిలోనూ శీను వొళ్ళు వేడెక్కిపోతోంది. శీనుకు, శ్రీనివాసుడెందుకో జ్ఞాపకం వచ్చాడు. 'నువ్వూ నాలాటి రసికుడివే గద్రా. అందుకే నాలాటోలకోసం, అపుడపుడిలాటి కలరు సెట్టింగులన్నీ సృష్టిస్తుంటావు' మనసులో వికృతంగా నవ్వుకున్నాడు.

చలికి వొణికిపోతూ, తలమీది పవిటను మరోమారు సరిచేసుకుంది. ప్రహరీ గోడ గేటును, ఆ నిమిషం పోతే దాటిపోయేదేమో ! కాని... అపుడే శీను పంజా విసిరాడు.

దడుసుకున్న లచ్చిమి గుండె వేగంగా కొట్టుకుంటోంది. ఆర్తిగా కేకలు వేయబోయిన ఆమె నోటిపై శీను తన ఇనుప హస్తాన్ని వేసి, గేటు లోపలికి లాగేసాడు.

మఱునాడు —

నిశాదేవి చీర కొంగును, మెత్తగా తొలిగించుకుంటూ, బద్ధకంగా బయటకు తొంగి చూస్తున్న భాస్కరుడు, మెల్లగా తన బాల కిరణాలను విశ్వంలోనికి విసరటం ప్రారంభించాడు.

ఆ కిరణాల వేడి తగిలితే, కటిగిపోతామని భయపడుతున్నట్టున్నాయి, మంచు ముక్కల్లాంటి చిన్న చిన్న మేఘాలు. అందుకేనేమో, వాయు దేవుడితో నేస్తం కట్టి, దూరంగా పారిపోతున్నాయి. వాటి పిచ్చికి నవ్వుకుంటున్న అరుణుడు, వాటిని ఏడిపించటానికై, మరికాస్త వాడిగా, వేడిగా తన కిరణాలను విసురుతున్నాడు.

అట్టి శీతాకాలపు ఉషోదయాన —

పుష్యమాసపు చలికి ఒణుకుతున్న పోలీసులు, పౌరులూ, పార్క్ జంక్షన్‌లోని ప్రహరి గేటు దగ్గఱ మూగారు.

గేటు లోపల పిచ్చిమొక్కలతో పాడుపడ్డ ఖాళీ స్థలం. బోనులా కనిపించే ఓ పాత చెక్కల బడ్డీ ... గేటుకు ఆనుకుని, చుట్టూరా రాత్రి వర్షం మిగిల్చిన చెత్తా, మట్టితో, ఈగలు ముసురుతున్న శవం !!

ఆ అర్ధరాత్రి —

రైల్వే పార్క్‌లో ... పరదాల చాటున, చలి చేస్తున్న పోరును, వయసు రగులుస్తున్న వేడితో ఎదుర్కొంటున్నారు అప్పన్న, లచ్చిమీనూ !

'హబ్బా !' లచ్చిమి మూల్గింది. 'మావా ! నా మీద సెయ్యెయ్యకు. వొళ్ళు నొప్పెడతంది' అంటూ, చేతులతో గుండెల్ని కప్పుకుంది.

'లచ్చీ ! ఆ దెబ్బలేటే ? సెప్తాసన్నావు. సెప్పేనేదు ... ఏటిసెప్పు' మెల్లగా లచ్చిమికి మాత్రమే, వినిపించేటట్టుగా అడిగాడు.

'మావా ! ఇప్పుడు కాదులే. రేపు సెప్తాను.'

'ప్ ! మెల్లిగా ... సాట్టోడు నెగుస్తాడు. మరి ... మొన్నడిగితే, ఇయ్యాలన్నావు. మల్లీ ... రేపంతన్నావు. అసలేట్టైందే ?'

'సెప్తాను మావా !' ఆ మాటన్న లచ్చిమి, ఓ నిమిషంపాటు ఏం చెప్పనేలేదు. అంతటి విషయాన్ని చెప్పటానికి ధైర్యాన్ని పెంచుకోవటానికన్నట్టు, గట్టిగా ఓమారు ఊపిరి పీల్చుకుంది.

'ఏటే ?' అప్పన్నకు అసహనం.

'మావా ! మొన్నటి వరసం రోజు ... మీ కోసం నిలబడి నిలబడి, తడిసిపోయి సలేత్తుంటే, రంగడి కొట్టుకాసి ఎల్తన్నాను' లచ్చిమి, అప్పన్న చెవి దగ్గఱగా చెప్తోంది. అప్పన్న 'ఊ' కొడ్తున్నాడు.

'ఎల్తున్న ఎన్ను, ఆ ఎదవొచ్చి పక్కకి లాగేసాడు.'

'ఎవుడే ఆడూ ?'

'ఆడే ... ఆ రవుడీసెదవ, శీను.'

'ఆడా ?? సచ్చినాడు గదేటే ?!'

'ఆ ... పీడా ఇరగడైపోయింది. ఆడు బతికుంటే, నన్ను బతకనివ్వడు. అందుకే ... అందుకే ... ' ఆపై చెప్పలేనట్టు, లచ్చిమి సన్నగా ఏడుస్తోంది.

'పోన్లే ఊరుకోయే ... ఇక సెప్పొద్దులే' అప్పన్న ఓదార్పు.

ఓ రెండు నిమిషాల మౌనం. స్టేషన్లోనికి, 'కోనార్క్' వచ్చినట్టుంది.

'మావా ! పూర్తిగా సెప్పేనియ్. సెప్పేస్తేనే గాని, మనసు సులకనయ్యేటట్టు నేదు. ఈ యినయం కడుపులో ఎట్టుకొని, నీతో సరిగ్గా ఉండనేకపోతన్నాను. అందుకే – ఎవులికీ తెలియని ఇనయం, నీకు సెప్తన్నాను. కడుపులో ఎట్టుకొని, నన్ను కాపాడుకుంతావా ?'

'ఏట్టైందే?...నాకేం అరదం గావడం నేదు.'

'మావా ! ఆడు ... ఆడు సచ్చిపోనేదు. సంపేసినాను.'

'స్స్ ! నోరుముయ్యే...పరాసికాలాడతన్నావా?'

'నేదు మావా ! నిజవే. అసలేట్టైందంతే – అక్కడంతా ముల్ల డొంకలు. సిక్కోం లాగేసినాడు. డబ్బుపోతే పోయింది. ఏటేటో అన్నాడు. ఇంకా... ఏటేటో సెయ్యబోతంటే ... సెనుగులాడ్నాను. బతిమలాడ్నాను. అన్నా, నీకు సెల్లిల్లునేరా ? అని కాలొట్టుకున్నాను. ఏదో అంటారు గదా — లేడి కంట ఏడితోటే, ఏటగాడికేం పనని...అచ్చవలగె... సెల్లిల్లునేరా అన్నమాట కాయెదవన్నాడూ, నేకేవే... ఆలు పతివరతలు. నీలాగ అన్నా అన్నా అంటూ, 'ఆ సాట్టోడి ... ' అప్పన్న లచ్చిమి నోరు మూసేసాడు.

ప్రక్క రోడ్డమ్మట, ఉండీ-ఉండీ ఆటోలూ, రిక్షాలూ వెళ్తున్న చప్పుళ్ళు.

'మావా ! దేవుడిలాటి అన్నను ఆ ముక్కనీ సరికి, నాకు ఎంతోటి కోపవో సెప్పలేను. కత్తుంటే కైమా ... ఆ ఎర్రి కోపంలో ఏ సేస్తున్నానో, నాకే తెల్దు. కొరికి, గుద్ది .. అలిసిపోను. వరసం పడతానే ఉంది. కేకలేసాను అరిసాను మీరొత్తారేవోనని...వూహూం...ఎవులూ రానేదు.

ఆ యెదవకి బుద్ధి మారనేదు. అలాగ సెనుగులాడ్తా, సివరికి నన్నాడు కిందికి తోసేసి, నా మీద పడిపోనాడు. పడిపోయిన నాకు, అయే సివరి గడియలనుకున్నాను.

పిచ్చికోపం. ఆడ్నేదో సేసెయ్యాలని కచి, అపుడే గురుతుకొచ్చింది, ఓ రెండు సమచ్చరాల కిందట యినయం. రైల్వే కోట్టర్సులో ఓ యమ్మను, ఎవుడో ... పిల్లల తల్లనైనా సూడకున్నా ... ఏదో సెయ్యబోతే ఆ తల్లికి మరేం తోసక...మాన్నం కాపాడుకోడానికి ఆడి ''ఆయువు'' పట్టును-తెంపేసి... !!'

'లచ్చి ! ? ! ? !'

'మావా ! నానూ ఆ పనే సేసినాను. తప్పా మావా ?'

'లచ్చీ' అంటూ ఆమె తలపై ఓ చేయి వేసి నిమురుతూ, ఓ చేత్తో ఆమెను అదుముకుంటూ 'నేదే... నేదు. ఆడికేగాదు, అసలలాటి ఎదవలందరికీ, అదేనే సరైన సిచ్చ !!'

'మావా! అలా సేయప్పోతే ఆడు నన్ను... పాడుజేసేస్తాడు. పాడయి, నీ దగ్గిరికి రాలేను మావా... సస్తాను తప్ప !'

'లచ్చీ !'

'అవును మావా ! సచ్చేదాకా నీతోటి బతకాలనే ఆడ్ని... ఆ యెదవని సంపేసినాను మావా!' అంటున్న లచ్చిమిని ఉప్పొంగిన అభిమానంతో, ఆపై అప్పన్న మరి మాట్లాడనేలేదు. ★



సీరియల్

# రాగజ్వాల

చిట్టారెడ్డి సూర్యకుమారి

శ్రీకాంత్ మంచంపై గోడ వైపుకు తిరిగి పడుకున్నాడు.

రమ్య గదినంతా కలియచూసింది. ఎక్కడి వస్తువులు అక్కడ సర్దివున్నాయి. పుస్తకాల అలమారులోని పుస్తకాలపై దుమ్ము, ధూళిలేదు. బట్టలు కూడా బట్టల స్టాండుపైనే వున్నాయి. అక్కడా ఇక్కడా పడిలేవు. శ్రీకాంత్ పడుకున్న పడక కూడా నలగలేదు. అన్నీ నీట్ హేబిట్స్.

రమ్యకు తమ గది జ్ఞాపకం వచ్చింది. విష్ణుకు చొక్కా విప్పితే స్టాండుపై వేయటానికి బద్ధకం, ఎక్కడ నిలబడి విడుస్తాడో అక్కడే క్రిందికి జారేస్తాడు. మరి ఆ మగ మహారాజుకు అంత బద్ధకం. ఇకవాడు పడుకున్న పడకను చూడలేరు. దున్నేస్తాడు. వాడి పడక అసహ్యంగ వుంటుంది. రమ్య మంచంపై పడుకుంటాడుగాని చేతులెత్తి దుప్పటి విదల్చడు.

రమ్య వొక్కతే శుభ్రం చేయలేక విసుగొచ్చి తనూ అలాగే చేస్తుంది. ఆ గదిలో ఎక్కడ చూసినా పుస్తకాలు, గుడ్డలు. కాలేజీకి వెళ్లే సమయానికి కావలసిన పుస్తకం కాని, పెన్నుకాని కనపడదు. ఒక పెన్ను దొరికితే దాన్ని ఇద్దరూ నాది అంటే నాది అంటూ గింజుకుంటారు. పెన్ను ఒకరికి, క్యాప్ ఒకరికి దక్కుతుంది.

తీరిక వుంటే అమ్మ ఆ గది శుభ్రం చేస్తుంది. లేదా ఎన్నాళ్లయినా అలాగే వుంటుంది.

ఎప్పుడైనా అక్కలు ఆ గదిలోకి తొంగి చూస్తే ముక్కు మూసుకుంటారు.

అటు మళ్లిన శ్రీకాంత్ ఇటు తిరిగాడు. అతని జుట్టు రేగివుంది. ఆ రోజు గడ్డం పెరిగింది. ముఖం తేటగా వున్నా, కళ్లు ఎర్రబడివున్నాయి.

''జ్వరంగా వుందా !'' మంచం దగ్గరకు వెళ్లి నుదుటిమీద చెయ్యి వేసింది. ఆ చేతిని పట్టుకుని ముందుకు లాగాడు. తేలిగ్గా మంచంపై కూర్చుంటూ ''కాంతీ ! ఎందుకు పడుకున్నావ్ ! వంట్లో బాగోలేదా ? నా కెంత భయం వేసిందను కున్నావ్ ! సరోజ వచ్చింది కదూ ? ఎంతసేపు వుండింది ! ఎప్పుడు వెళ్లిందీ ! అసలు ఎందుకు వచ్చినట్టు ! మీ అమ్మ, శుభ లేరు కదా ! సిగ్గు లేకుండా ఎందుకు వచ్చిందీ ! ... ''

రమ్య గుక్కతిప్పకోకుండా అన్ని ప్రశ్నలు వేసినా – ఒక్కటీ చెవిన పడలేదు. కోపంతో కందిన రమ్య ముఖాన్ని చూస్తున్నాడు.

''ఏమిటా పిచ్చి చూపు ? కిటికీలు మూశారు,

(గత సంచిక తరువాయి)

మీ వుద్దేశం ఏమిటో కనుక్కుందామని వచ్చాను.''

''ఎందుకా ? ఇందుకు !'' గబుక్కున రమ్యను పైకి లాక్కున్నాడు.

అతని శ్వాస వెచ్చగా చెంపల్ని తాకింది.

రమ్యను గట్టిగా గుండెకు అదుముకుంటూ ''రమ్యా ! రమ్యా !'' అని పలువరిస్తున్నాడు.

రమ్య తేరుకుని ''కాంతీ !'' అంది.

''రమ్యా ! నీ ప్రేమ జ్వాలగా మారి నన్ను కాల్చేస్తూంది. పిచ్చివాణ్ని చేస్తుంది రమ్యా !'' చేతులతో బంధించి, చుబుకం పట్టి ముఖాన్ని తనవైపుకు తిప్పుకున్నాడు. రమ్య కళ్లు విప్పారించి శ్రీకాంత్‌ను చూసింది. అతని ముఖం కందిన సూర్యబింబంలా వుంది. కళ్లు జ్యోతుల్లా వెలుగు తున్నాయి. చేతులు వీపును నిమురుతున్నాయి.

శ్రీకాంత్‌కు ఏమైందీ రోజు ? ఏమిటీ ప్రేలాపన ! రమ్యకు భయం వేసింది. అతని చేతుల్లోనుంచి తప్పించుకుని మంచంపై నుంచి లేచి దూరంగా వెళ్లి నిలబడింది.

రమ్య భయపడి, తనను విడిపించుకుని దూరంగా వెళ్లి నిలబడితే శ్రీకాంత్ చిన్నబోయి చూశాడు. ఆ చర్య బాధ కలిగించినట్లు స్పష్టంగా అతని చూపుల్లో కనపడింది.

రమ్య తనలాగే ఆర్తిగా వచ్చి తనను పెనవేసుకు పోతుందనుకున్నాడు. కాని తన చర్య రమ్యకు ఆశ్చర్యం కలిగించినట్లు బెదిరి బెరుకుగా చూస్తుంటే తనను తాను సంభాళించుకుని ''రమ్యా !'' అని పిలిచాడు.

రమ్య కాళ్లు బలహీనమై వణుకుతున్నాయి. నిలబడలేక దగ్గర వున్న కుర్చీలో కూర్చుంది.

శ్రీకాంత్ లేచి వచ్చాడు. రమ్య కాళ్లదగ్గర మోకాళ్లపై కూర్చుని నడుం చుట్టూ చేతులువేసి వడిలో తలపెట్టి పడుకున్నాడు.

రమ్య అప్రయత్నంగా తలపై చెయ్యి వేసి జుట్టులోకి వేళ్లను పోనిచ్చి ''కాంతీ !'' అని పిలిచింది.

''ఏమైందీ ! ఇదంతా ఏమిటి ?'' లాలనగా బుజ్జగిస్తున్నట్టు అడిగింది.

---

**జరిగిన కథ—1 :** నాగయ్య, అమరేశ్వరిలకు ముగ్గురు కూతుళ్లు, ఒక్క కొడుకు విష్ణు. పెద్ద కూతుళ్లిద్దరు ఉద్యోగాలు చేస్తున్నారు. మూడవ కూతురు రమ్య, ఎదురింటి శ్రీకాంత్ ప్రేమించుకొంటారు.

---

తలెత్తి చూశాడు. కనుదోయి కెంపుల్లా మెరుస్తున్నాయి. ''ఏమైందో చెప్పాలా!'' మెత్తగా లేచాడు. తలుపులు గడియపెట్టి వచ్చాడు. అమాంతంగా చేతులపై ఎత్తుకుని తీసుకువెళ్లి మంచంపై పడుకోపెట్టాడు. శ్రీకాంత్ ఇంకా ఏమి చెప్పతాడోనని రమ్య ఎదురు చూస్తూంది.

పున్నమినాటి చంద్రిమను చూసి ఎగిసెగిసి పడుతున్న సముద్రుడిలా తన గుండె ఎగిసెగిసి పడుతుంటే రమ్య హృదయంపై చెయ్యివేసి ముందుకు వంగి, రమ్య అధరాలను అందుకున్నాడు.

కాలం స్తంభించిపోయింది. రమ్య కళ్లు మూతలుపడ్డాయి. అప్రయత్నంగా కాంతిని చుట్టేసింది.

ప్రియమైనవాడి సమీపం ఆనందాన్ని, తన్మయత్వాన్ని కలిగిస్తుంది.

ప్రొద్దున నుండి పడిన వేదన క్షణంలో మాయమైంది.

క్షణాలు – నిముషాలు ఎన్ని గడిచిపోయాయో తెలియదుకాని – శ్రీకాంత్ వుద్రేకం రమ్యను తట్టి లేపింది. మత్తులాంటి ప్రేమనుంచి, మైకం నుండి, వివేకం తటాలున మేల్కొంది. ఊపిరి బిగపెట్టింది. నిజస్థితి గ్రహించి తెల్లబోయింది. తర్వాత సిగ్గుపడింది.

బ్లౌజు వూడిపోయింది ... చీరంగా పైకి పోయింది ... గబుక్కున శ్రీకాంత్ చెయ్యిపట్టుకుని మరి ముందుకు పోనీయక ''కాంతీ ! కాంతీ !'' అని ఏడుస్తూ పిలిచింది.

ఇంద్రధనుస్సు నెక్కి స్వర్గాన్ని చేరుకుంటున్న వాణ్ణి పట్టి లాగినట్లైంది. అయిష్టంగా వక్షస్థలంపై నుంచి తలెత్తి చూశాడు.

శ్రీకాంత్ రమ్య కన్నీటిని చూశాడు, చల్లటి నీరు ముఖాన కొట్టినట్లైంది.

దివి నుండి భువికి దబ్బున పడినట్లు వులిక్కిపడ్డాడు. తన అవివేకానికి, వుద్రేకానికి సిగ్గుపడ్డాడు. రమ్య అధరాలు అల్లల్లాడుతున్నాయి. రెండు చెంపలను మృదువుగా పట్టుకుని కళ్లమీద నీటి బిందువులను, పెదాలతో అద్ది ... ''సారి ! వెరీ సారి రమ్యా ! కోరిక కాల్చేస్తుంటే నన్ను నేను అదుపులో పెట్టుకోలేకపోయాను. నా ప్రాణమా ! నన్ను క్షమిస్తావు కదూ ! రమ్యా ! ఏడవకు నీ కంట నీరు చూడలేను.

నీవూ – నేను వేరుకాదు అని అనుకున్నాను. మనసా – వాచా ప్రేమించిన అమ్మాయిని కోరుకోవటంలో తప్పులేదు. నీవు నా దానవే అన్న భావంతో నా స్వంతం చేసుకోబోయాను. నిన్ను చూస్తూ నీకు దూరంగా ఇక వుండలేననుకున్నాను. రమ్యా ! నేనా పెళ్లివయస్సు వచ్చిన కుర్రాడిని. మనస్సు నిండా కమ్మని కోరికలు. నా అందాలరాశి చేతికి దొరికిన క్షణం మధుర క్షణమై నన్ను నేను మరచిపోయాను. రమ్యా !'' అంటూ బ్లౌజు గుండీలు సరిచేశాడు. చీర కుచ్చెళ్లు సరిచేస్తుంటే రమ్య స్పర్శ రమ్యంగా హృదయానికి తాకింది. అప్పటికప్పుడు స్వేదబిందువులు ముత్యాల్లా నుదుటన నిలిచాయి.

ఉప్పొంగుతున్న వుద్రేకాన్ని పళ్ల బిగువునపట్టి – ''రమ్యా ! వెళ్లి పో ! మరో క్షణం ఇక్కడ వుంటే

నేనేమైపోతానో నాకే తెలియదు ప్లీ...జ్'' ప్రక్కగా దిండుపై వాలిపోయాడు. అతని గుప్పెట మూసుకుంది.

అలాంటి స్థితిలో శ్రీకాంత్‌ను ఎప్పుడూ చూడలేదు. వూహించను కూడా లేదు. మెల్లగా లేచి రమ్య వచ్చేసింది. ఎలా వచ్చిందో! తనకే తెలియదు. తన గదిలోకి వచ్చి చేరుకుంది.

ఎగిసిపడే గుండెను అదుపులోకి తెచ్చుకునే టప్పటికి పొద్దు మునిగిపోయింది.

ఆ రోజు రమ్య కాలేజీలో వుండలేకపోయింది. క్లాసు మధ్యలో లేచి వచ్చేసింది. పార్కు దగ్గరకు రాగానే రమ్య కాళ్ళు తన ప్రమేయం లేకుండానే పార్కులోకి దారితీశాయి. ఆ సమయంలో పార్కులో ఎవరూ వుండరు. బడి ఎగగొట్టిన పిల్లలు స్వింగ్ దగ్గర ఆడుకుంటున్నారు.

రోజూ వారు కలుసుకునే చెట్టు దగ్గరకు వచ్చింది. చెట్టుకు ఆనుకుని శూన్యంలోకి చూస్తూ కూర్చున్న శ్రీకాంత్ కనుపించాడు. వెళ్ళి భుజంపై చెయ్యి వేసింది. వులిక్కిపడినట్లు చూశాడు.

ప్రేమగా, ఆర్తిగా ఒకరి నొకరు చూసుకుంటూ ఒకరి మనస్సులో ఏముందో వారి ముఖంలో కనుపిస్తుందని పరీక్షగా చూసుకోసాగారు.

శ్రీకాంత్ తన భుజంపై వున్న రమ్య చేతిని సుతారంగా ముద్దు పెట్టుకున్నాడు. అప్పుడు తనలో చలనం కలిగినట్లు రమ్య కదలి శ్రీకాంత్ ప్రక్కన వచ్చి కూర్చుంది.

''కాంతీ! ఈ వేళప్పుడు ఇక్కడ ఏం చేస్తున్నావ్?'' మెత్తగా అడిగింది.

''నేను నిన్ను ప్రేమించినట్లు – నేను నిన్ను కోరుకున్నట్లు నీవు నన్ను ప్రేమించటం లేదని పించింది.''

శ్రీకాంత్ తలను హృదయానికి చేర్చుకుని ''కాంతీ! నీవు నా హృదయంలోకి తొంగి చూడ గలిగితే అక్కడ పీఠం వేసుకుని కూర్చున్న నిన్ను నీవు చూస్తావు. కాంతీ! నా హృదయం ఏమం టుంది? 'కాంతి! కాంతి ... కాంతి' అని స్పందించటం వినలేదా! కాంతి! నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో తెలుసా? నీపై మరొకరి నీడ పడినా సహించలేను. నీలో నేనే నిండిపోవాలి. నీ ప్రేమంతా నాకే కావాలి. నీవు మీ అమ్మగారిని, చెల్లిని ప్రేమించినా సహించలేని స్వార్థమైన ప్రేమ నా రక్తంలో ప్రవహిస్తూంది. అది నన్ను కాల్చి వేస్తుంది. నిన్ను నాలో లీనం చేసుకోవాలని – నా రక్తంలో నీ రక్తం ప్రవహించాలని నీ కంటే ఎక్కువగా కోరుకుంటున్నాను. నన్ను నీకు ఇష్టంగా అర్పించుకోవాలని నిన్ను స్వంతం చేసుకోవాలని, నీపై సర్వ హక్కులు పొందాలని ఎంతగానో వువ్విళ్ళూరుతున్నాను.

మరొక స్త్రీ నిన్ను కోరినా, చూసినా సహించలేను. ఆ సరోజ మీ ఇంటికి వచ్చి నీతో మాట్లాడుతుంటే నాకెంత కష్టంగా వుంటుందో తెలుసా? నీవు నా స్వంతమైతే ఆ సరోజను మనింటికి రానిస్తానా? నీ కంటే నాకే ఎక్కువ ఆత్రంగావుంది. కాని...మనకు కొన్ని కట్టుబాట్లు– ధర్మాలు వున్నాయి.

పెళ్ళికాకుండ ఏదైన చేస్తే తప్పు అంటారు. తప్పుచేసి గిల్టీ ఫీలింగ్‌తో మా వాళ్ల మధ్య నేను వుండగలనా! ఆ తప్పు నన్ను కాల్చివేస్తుందని భయపడ్డాను. అంతగా ప్రేమించే అమ్మ ముందు ఎలా తలెత్తుకు తిరగను. రాత్రిళ్ళు ఒక ప్రక్క నాన్న గురక వినిపిస్తూ వుంటే ఎప్పటిలాగ నిర్మలంగా నిద్రపోగలనా?

నా కంటే పెద్దవాళ్లయిన అక్కలు పవిత్రంగా వున్నప్పుడు నన్ను పాపభీతి పీడిస్తుంటే ఎప్పటిలాగ వారితో అన్యోన్యంగా, స్నేహంగా వుండగలనా?

చిన్నవాడైన విష్ణుకు బుద్ధి చెప్పవలసిన నేను మన సంఘ నియమాలు తప్పనా? నా వారి మధ్య జీవించగలనా? నా కాంతీ! నీ సందేహం తీరిందా? కాంతీ నేనొక నిశ్చయానికి వచ్చాను ...''

''ఏమిటి!'' అన్నట్టుగా రమ్య హృదయంపై నుంచి కన్నులెత్తి చూశాడు.



శ్రీకాంత్ కన్నుల్లోకి చూస్తూ "నీతో రమ్మన్నావ్ కదూ! నీవు ఎప్పుడు – ఎక్కడికి తీసుకెళ్ళినా అక్కడికి వస్తాను." ఎంతో మంచి మాట విన్నట్లు శ్రీకాంత్ కళ్ళు సంతోషంతో వెలిగాయి. గర్వంగా అతని పెదవుల వంపులో నవ్వు మెదిలింది.

ఆ రోజంతా ఆ చెట్టు క్రింద కూర్చుని వారి భవిష్యత్తుకు బాట వేసుకోసాగారు.

* * *

శ్రీకాంత్ నుంచి ఎప్పుడు కబురు వస్తే అప్పుడు పోవటానికి రమ్య తయారుగా వుంది. కాని ... గుండెల్లో గుబులుగా వుంది. దొంగచాటుగా తనవాళ్ళని వదలి వెళ్ళటానికి భయంగా వుంది. రహస్యంగా పెళ్ళి చేసుకోవటంలో ఏమి ఆనందం వుంటుంది! శాశ్వతంగా తన వారికి దూరమైనట్లే కదా! తను వెళ్ళాక ఎద్మావతమ్మ ఏమి గొడవ చేస్తుందో – నాన్నని అవమానిస్తుందా? ఎన్ని మాటలు అంటుందో! తన వారికి తలవంపులు తెచ్చే పని చేస్తోంది. అన్నీ తెలుసు. వూహించ గలదు. కాని వెళ్ళక తప్పదు. ఎప్పటికైనా స్త్రీకి భర్తతోటి జీవితం ముడిపడి వుంటుంది ... అని రమ్య తను చేయబోయే పనిని సమర్థించుకోసాగింది.

విష్ణు అంటే చెప్పలేని మమతానురాగాలు రమ్యకు. తిట్టుతూ – తంతూ వ్యక్తం చేస్తుంది. అందరికంటే విష్ణుని వదలి వెళ్ళాలంటే ఎక్కువ బాధగావుంది.

అక్కా తమ్ముడు కలసి ఎన్నో విషయాలు చర్చించుకునేవారు – తర్కించుకునేవారు. భేదాభిప్రాయాలు వస్తే తన్నుకునేవారు. తను తంతుంటే ఆ దెబ్బను కాచుకునేవాడుకాని – తిరిగి కొట్టేవాడు కాదు.

"రమ్యా! నీకెంత పొగరే! వాడు మగవాడని చూడక కాలితో తంతావా?" అని అమ్మ అడ్డు వచ్చేది.

"మగ మహారాజు కదా! చేత్తో కొట్టకూడదు. వాడికి ఆ దెబ్బ ఆనదు. అందుకే ..."

"అమ్మా! అది మగరాయడే!" అంటూ అమ్మను చాటుచేసుకునేవాడు.

పెద్దవాళ్ళకి తెలియకుండా ఎన్నో తుంటరి పనులు చేసి నవ్వుకునేవారు.

# రాగజ్వాల

తలుచుకుంటే తన బాల్యం ఆనందంగా గడిచి పోయిందనిపించింది.

ఆ రోజు ఎప్పటిలా "మగమహారాజు" అంటూ హేళన చేస్తూ గరిటతో కొట్టక వడ్డిస్తున్న రమ్య వైపు చూశాడు.

"రమ్యా! వంట్లో బాగులేదా! నేను పెట్టుకుని తింటాలే – నీవు వెళ్ళి పడుకో!... అలాగే గరిటతో ఒక్కటియ్యి – లేకుంటే నాకేదో తక్కువైనట్లు వుంటుంది." అంటున్న విష్ణు అన్నం కలుపుకుంటుంటే రమ్యకు కన్నీళ్ళు ఆగలేదు. దుఃఖాన్ని ఆపుకుంటూ అక్కడనుంచి లేచిపోయింది.

విష్ణు గదిలోకి వచ్చి లైటు వేశాడు. రమ్య ఏడుస్తోంది. మంచం దగ్గరకు వచ్చి ప్రక్కన కూర్చుని "రమ్యా! ఎందుకు ఏడుస్తున్నావ్!" అని అడిగాడు.

రమ్య ఏడ్వడం అతనెప్పుడూ చూడలేదు. ఇలా దుఃఖంగ వుండడం అతనెప్పుడూ చూడలేదు.

రమ్య ఇంట్లో వాళ్ళందరికంటె గయ్యాళి – గడుసుది అని పేరు తెచ్చుకుంది.

రమ్య తనకు కావలసినది కొట్లాడి తీసుకుంటుంది. దెబ్బలాడుతుందేగాని, సిల్లీగా ఏడ్వదు. అలాటి రమ్య ఎందుకు ఏడుస్తుంది. ఏదో బలమైన కారణం వుంటుంది – అని తలుస్తూ "రమ్యా! నాతో చెప్పవా?" అని అడిగాడు.

రమ్య కన్నీళ్ళు తుడుచుకుంది. ఇంట్లో ఎవ్వరికి చెప్పక రాత్రికి రాత్రి మాయమైపోలేదు. తను ఎక్కడికి వెళ్ళిందో, ఏం చేస్తుందో ఇంట్లో ఒకరికైనా తెలియాలి. లేకపోతే ఏమైపోయిందోనని భయపడతారు. ఒక నిశ్చయానికి వచ్చింది.

"విష్ణు! నీవు నా స్నేహితుడివి కదూ?"

"వూ!"

"మనిద్దరి మధ్య ఎన్నో సీక్రెట్స్ వున్నాయి. ఒకటి చెప్పతాను ఎవ్వరికి చెప్పవుగా?"

"వూ!"

"వూ కాదు. ప్రామిస్ చేయాలి."

"ప్రామిస్."

"విష్ణు! నేను వెళ్ళిపోతున్నాను."

"..............."

"విన్నావా?"

"ఎక్కడికి?"

"నేను, మన ఫ్రెండ్ శ్రీకాంత్ ప్రేమించుకున్నాం."

"ప్రేమించుకోటానికి వెళ్ళిపోవాలా?"

పరిస్థితులు అలా వచ్చాయి. నేను వెళ్ళిపోక తప్పదు. ఏదో ఫ్యాక్టరీలో వుద్యోగం దొరికిందట, ఇల్లు కూడా చూశాడు. రేపే వెళ్తున్నాను. నాకోసం ఎదురుచూస్తుంటాడు.

"అప్పుడే ఏం తొందర వచ్చింది?"

ఒకరినొకరు విడిచి వుండలేనంతగా వారి ప్రేమ బాధిస్తుందని, శ్రీకాంత్‌కు మరేదో కావాలసి తొందరపడుతున్నాడని, తమ్ముడికి ఎలా చెప్పతుంది! చెప్పలేక మౌనంగ వుంది.

ఆ రాత్రి కలతనిద్ర అయింది. విష్ణుకు ఏం చేయాలో తోచలేదు. ముందు ఈ సంగతి అమ్మకు చెప్పాలనుకున్నాడు. ప్రామిస్ చేసినట్లు గుర్తు వచ్చింది. అమ్మకు చెప్పాలా! వద్దా! అని తటపటాయిస్తున్న సమయంలో రమ్య బాత్‌రూంలో వాంతి చేసుకోవడం విన్నాడు.

ప్రేమలో పడినవారు వాంతి చేసుకుంటే గర్భం వచ్చిందని వాపోవడం చాల సినిమాలలో చూశాడు. చదువు పూర్తిచేయకనే రమ్య వెళ్ళిపోతాననటానికి ఇదే కారణమై వుంటుందని తలచాడు. ఇప్పుడు అమ్మకు చెప్పటంలో అర్థం లేదనుకున్నాడు. రమ్యను పోనివ్వటమే మంచిది. శ్రీకాంత్ మంచివాడు. అతను ఏనాటికి మోసం చేయడు.

రమ్యకు కొండంత ధైర్యం వచ్చింది. విష్ణు సహాయం లేకపోతే తనొక్కతే ఇంటి నుంచి ఎలా బయటపడేది? తన సామాను ఎవ్వరు చూడకుండా విష్ణు బయటకు జారేశాడు. టిక్కెట్టు కొన్నాడు. కంపార్టుమెంటులో జాగ్రత్తగా ఎక్కిచ్చాడు.

అక్కా తమ్ముళ్ళ హృదయాలు బరువుగా వున్నాయి. ఒకరి నొకరు నేరుగా చూసుకోలేక వున్నారు. గొంతులో ఏదో అడ్డుకున్నట్లు గొంతు ఆరిపోతోంది. రక్తపాశం ఒకరి వైపుకు మరొకరిని లాగుతూంది. రైలు దిగి విష్ణుతో ఇంటికి పోవాలని, తన గదిలో నిశ్చింతగా పడుకోవాలని పించింది.

## ఎంత కాలమని?

ఏ అమ్మైనా
తొమ్మిది నెలల కన్నా ఎక్కువ రోజులు మోయదు!
ఏ అయ్యైనా
రెక్కలొచ్చేదాకానే కంటికి రెప్పలా కాస్తాడు!
నీవింకా
ఎందుకని వాడి తలకు గొడుగు పడతావ్?
ఇంక యింకా
ఎంత కాలమని వాడింటి కుక్కలా బ్రతుకు
గడుపుతావ్?

## ఫ్యాక్ట్!

న్యాయం నల్లకోటు
ధర్మం తెల్లగోడ
మానవత్వం ఉత్తుత్తి ఖద్దరు గుడ్డ
మమకారం వఠి ఖాళీ గుడ్డ
ఇంకేముంది ...
నీవు తల తెగి క్రిందపడ్డ గాంధీ బొమ్మవి!

## వేదోపనిషత్!

'అమ్మే నారాయణా'
అనేది ఉపనిషద్సారాంశమే కాదు
ఇప్పుడు చాలమంది కది తారక మంత్రం!
పరపతి పెంచుకోడానికి
బాగా పనికొచ్చే ఓ యంత్రం!

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

కాని ఆ వూరిలో తన కోసం శ్రీకాంత్ ఎంతో ఆశగా ఎదురుచూస్తూ వుంటాడు. ఏవేవో కలలు కంటూ ఎన్నో ప్లానులు వేసుకుంటూ వుంటాడు. అతను ఎదురుచూస్తున్న రైలులో తను రాకపోతే నిరాశతో ఏ అఘాయిత్యం చేసుకుంటాడో! అని అనుకుంటే తొందరగా శ్రీకాంత్‌ను చేరుకోవాలనిపిస్తుంది. "జాగ్రత్త! జాగ్రత్త!" అని చిన్న తమ్ముడు తనకు జాగ్రత్త చెప్తుంటే ప్రేమగా తలమీద చేయివేసి జుట్టు రేపింది. అలా జుట్టు రేపేస్తే చెప్పలేనంత కోపం విష్ణుకు.

"ఒరే విష్ణు! నిన్ను ఎన్నోసార్లు తన్నాను, తిట్టాను. కాని అదంతా ప్రేమేరా!" అని చెప్పాలనుకుంది. కాని స్వరం పైకి రాలేదు. హఠాత్తుగా తన చేతులకు రెండు బంగారు గాజులు వుండటం చూసింది. అవి అమ్మ స్నానానికి పోతూ గాజులు తీసి ఇచ్చింది. అప్పుడు వేసుకున్నవి అలాగే వున్నాయి.

"విష్ణు! అమ్మ గాజులు మర్చిపోయి వేసుకు వచ్చాను. తీసుకు వెళ్ళు!" అని తీస్తుంటే "వద్దంటూ!" వారించాడు.

"ఉంచు. ఇప్పుడు నీకు అవసరం. పెళ్లి చేస్తే ఇంకా చేయించేవారు కదా!" అంటూ, తన మెడలో వున్న పులిగోరు చైను తీసి రమ్య మెడలో వేశాడు.

"రమ్యా! నానిగాడికి నేనేమవుతాను?"

"నానిగాడా! వాడెవ్వడూ!" అంది ఆశ్చర్యంగా.

"నీకు పుట్టే బాబు!" సిగ్గుసిగ్గుగా నవ్వాడు.

రమ్య బిత్తరపోయింది. అలా అనుకున్నాడా విష్ణు!! అందుకే ఎవ్వరికి చెప్పను సాహసించలేకపోయాడు! "ఇదీ ఒకందుకు మంచిదే అయింది." అని అనుకుంది. రమ్య తీయగా కొంటెగా నవ్వుతూ, నీవు 'మామవి, చందమామవి' అంది.

"నా గొలుసు ఆ మగ మహారాజు మెడలో వేస్తావుగా!"

"వద్దురా! అమ్మ నీకెంతో ప్రేమతో చేయించింది."

ఆ దండ విష్ణుకు చేయించిన రోజు పెద్ద గొడవ చేసింది రమ్య.

అమ్మాయికి చేయిస్తారుగాని ఎక్కడైనా అబ్బాయికి చేయిస్తారా! అని అందరిమీద దెబ్బలాడింది. విష్ణు గొలుసు వేసుకున్నరోజు 'ఆడంగి వెధవ!' అని కూడా తిట్టింది.

"వద్దురా!" అని రమ్య ఎంత బలవంతం చేసినా వెనక్కి తీసుకోలేదు విష్ణు.

రైలు కూత వేసింది.

"విష్ణు, బాగా చదువుకోరా!"

"అలాగే! తొందరగా పెద్దయి అక్కలె పెళ్ళిళ్ళు చెయ్యాలి" నవ్వాడు విష్ణు.

రైలు కదిలింది.

రమ్య కన్నీటిని తుడుచుకుని, తమ్ముణ్ణి చూసింది. మరెప్పటికి, మరెన్నాళ్ళకి చూస్తానో అనుకుంది.

గమ్యస్థానం చేరుకునేందుకు తొందరపడుతున్నట్లుగా రైలు వూపందుకుంది.

## రాగ జ్వాల

రైలు వెళ్లిపోయినా చాలాసేపు ప్లాట్‌ఫామ్ మీద వుండిపోయాడు విష్ణు.

*   *   *

పొద్దు పొడిచింది. కొత్తరోజు పుట్టింది. శ్రీకాంత్, రమ్యలకు పండుగ రోజు. ఎన్నో ఆశలతో, మరెన్నో కోరికలతో కొత్తకాపురం పెట్టారు. రమ్య ఎక్కిన రైలు పొద్దున్న ఏడు గంటలకు వస్తుందని తెలుసు. కాని ఆ రాత్రికి స్టేషనుకు వచ్చి — ప్లాట్‌ఫారం బెంచీపై కాలక్షేపం చేసాడు. ఆ రైలు వస్తుందంటేనే ఉద్వేగంతో గుండె దడదడలాడింది. తన రమ్య ఎప్పుడు వస్తుందా! అని నిమిషాలు లెక్కపెట్టిన వాడు ఆ కొద్దిసేపు భరించలేకపోయాడు. ఒకవేళ రాకపోతే? అన్న ఆలోచన మనస్సులోనికి రానీయలేదు. రమ్య కనుపించిన కంపార్టుమెంటు వెనుకనే—చిన్నపిల్లాడిలా నవ్వుతూ—కడ్డీ పట్టుకొని పరుగెత్తి — కంపార్టుమెంటు ఎక్కాడు. అతని సంతోషం గుర్తించి రమ్య ఆనందపడింది.



తన ప్రక్క మౌనంగా నిలబడిన రమ్య చెయ్యి అందుకొని "థాంక్స్" అన్నాడు — సామాను తనే పట్టుకున్నాడు — ఒక సూట్‌కేసు, బ్యాగ్ వెయిటింగు రూంకి తీసుకెళ్లి — "స్నానం చేసి మంచి చీర కట్టుకో" అని చెప్పి వెళ్లాడు.

తల స్నానం చేసి పట్టుచీర కట్టింది — రాత్రి ఒక స్టేషన్‌లో కొన్న మల్లెపూలు తడిపిపెట్టింది— ఆ పూలు పెట్టుకొంది. పెట్టెలో జాగ్రత్తగా పెట్టిన గాజులు చేతుల నిండుగ వేసుకుంది. నుదుట ఎర్రని కుంకుమ దిద్దింది. కాళ్ళకు పసుపు — చేతులకు క్యూటక్సు కూడ వేసుకొంది.

పెట్టె, బ్యాగ్ సర్ది--ఫ్యాన్ క్రింద కూర్చుంది.

అంతలో తెల్లటి టెరికాటన్ పాంటు, షర్టులో ట్రిమ్‌గ తయారయ్యి, ఆ గదిలో రమ్య ఎక్కడ వుందా! అని ద్వారంలో నిల్చొని వెతకసాగాడు. పట్టుచీరలో వున్న రమ్యను గుర్తుపట్టనేలేదు. రమ్య నవ్వుకుంటూ వెళ్ళింది. అందంగ లక్ష్మీదేవిలా వున్న రమ్యను చూస్తూ "మై గాడ్! రమ్యా! నీవేనా! అచ్చం అమ్మాయిలా వున్నావు" అన్నాడు.

కినుకగా చూసింది. "ఇన్నేళ్ళు అబ్బాయి అనుకొని — ప్రేమించావా" అంది.

సామాను పట్టుకొని — స్టేషను బయటకు వచ్చి జట్కాబండిని పిలుస్తుంటే "ఎక్కడికి వెళ్తున్నాం" అని అడిగింది, జట్కాలో కూర్చున్నాక.

"భయంగ వుందా? నాతో ఎక్కడికైనా వస్తానన్నావ్" అంటూ టీజ్ చేసాడు.

రమ్య దిగులుగ వుంది. ఇంట్లో తను లేకపోయేటప్పటికి అమ్మ — నాన్న ఏం గొడవ పడుతున్నారో! అక్కావాళ్ళు ఈ రోజు కాలేజికి వెళ్తారా! తమ్ముణ్ణి ఏం అంటారో తనకు తోడ్పడినందుకు! అన్న ఆలోచనల్లో వుండగ - జట్కా ఓ దేవాలయం ముందు ఆగింది.

యాభై రూపాయల ఖర్చుతో కళ్యాణ మండపంలో — పెళ్ళి చేసుకొన్నారు.

ఆలయం నుంచి బయటకు వస్తూ "థాంక్స్" అంది శ్రీకాంత్‌తో. తిరిగి ఆ జట్కాలోనే ఎక్కారు. జట్కా పోతూవుంది. రమ్య శ్రీకాంత్ భుజానికి ఆనుకుంది.

"ఎక్కడికి వెళ్తున్నాం అని అడగలేదేం" అన్నాడు. జవాబు చెప్పలేదు. మరి కాస్త దగ్గరకు జరిగింది.

ఓ ఇంటి ముందు జట్కాబండి ఆగింది. శ్రీకాంత్ ఆ ఇంట్లోకి వెళ్లి — తాళం చెవి తీసుకొని ప్రక్కవాటా తలుపు తెరిచి—వెళ్లి—చెయ్యి పట్టుకొని లోపలికి నడిపించుకు వస్తూ —

"రమ్యా! ఇదే మన ఇల్లు" అని చెప్పాడు, మెరిసే కళ్ళతో చూస్తూ.

ఓ పెద్ద కిటికీవున్న చిన్న హాలు. దాని వెనుక మరో చిన్న గది. సామాను ఏదిలేదు కనుక ఇరుకు అనిపించలేదు. ఆ రెండు గదుల ఇల్లు వంద రూపాయలు. ఆ ఇంటివాళ్ళకి — అద్దె అంత ప్రాముఖ్యం కాదట — తోడుగా మరో సంసారం వుంటే బాగుంటుందని. వంద రూపాయిలకే అన్ని సౌకర్యాలు వున్న అలాటి పోర్షన్‌కి మరోచోట అయితే నూటయాభైకి ఎక్కువేగాని తక్కువగ ఇవ్వరని ఆ ఇంటి యజమాని చెప్పాడు.

"సరే, సరే!" అని శ్రీకాంత్ వప్పేసుకొన్నాడు. అంతకంటే తక్కువ ఇంట్లో — తన అందమైన 'రమ్య'ను వుంచలేననుకున్నాడు. పైగా రమ్యకు తోడుగా వుంటారు. తనకు వచ్చేవి మూడు వందల రూపాయలు.

ఇంటి అద్దె వంద పోతే — రెండు వందల్లో వారిద్దరూ జీవించలేరా? పిల్లలు పుట్టుకువచ్చే లోపల మరో వుద్యోగం సంపాదించలేడా! అని అనుకున్నాడు.

గదిని కలయచూస్తున్న రమ్యను గట్టిగ కౌగలించుకొని ముద్దు పెట్టుకున్నాడు. పోరాడి పోరాడి, జీవితంలో ఏదో గొప్ప కార్యాన్ని సాధించిన శాస్త్రవేత్తలా వుప్పొంగిపోతున్న శ్రీకాంత్‌ను కళ్ళనిండా ప్రేమను నింపుకొని చూసింది — రెండు చేతులా అనురాగాన్ని అందిస్తున్నట్లుగా - శ్రీకాంత్‌ను పెనవేసుకుపోయింది.

(ఇంకా వుంది

# ఇది ఆటకాదు

## పొడుగు వెంకటేశ్వరరావు



ఏ.సీ. రూంలో రివాల్వింగ్ చైర్‌లో విలాసంగా కూర్చుని 'త్రీఫైవ్స్' సిగరెట్ తగలేస్తున్న శేషగిరి మమ్మల్ని చూసి ఆదొకరకంగా కళ్ళెగరేసాడు. ఆ చూపులో దర్పం, అతిశయం.

'నేను సుబ్రమణ్యాన్ని' అన్నాడు సుబ్రమణ్యం, ప్రక్క చూపులు చూస్తూ.

అవునన్నట్టుగా తలెగరేసాడు శేషగిరి అలక్ష్యంగా, అలవోకగా.

'ఇతను రాజారావు. మన క్లాసుమేట్. గుర్తు వచ్చాడా ?'

'అవును గదా' అన్నట్టు తలాడించి కూర్చో మన్నట్టు చెయ్యి వూపాడు శేషగిరి. కూర్చున్నాము. కాని అంతసేపూ నా వంటిమీద తేళ్ళు, జెర్రులు పాకినట్టు అన్పించింది. కాలేజిలో శేషగిరి, నేను, సుబ్రమణ్యం, మరి ఇద్దరం బెస్టు ఫ్రెండ్సుము. ఎంతో ఇదిగా కలిసి తిరిగినవాళ్ళము. ఆ పాతరోజులు పోయాయి. కొత్తరోజులు నడుస్తున్నాయి. మారిన రోజులతోపాటు మనుషులూ రంగులు మార్చి కొత్త అవతారాలెత్తారనటానికి వీడు — ఈ శేషగిరి బలమయిన సాక్ష్యం. అప్పుడు పిరికిగా పీచులాగా వుండే శేషగిరి ఇప్పుడు గుమ్మడికాయలాగై, రంగు వచ్చి, ధైర్యంగా దర్పంగా అవుపిస్తున్నాడు. మేము అక్కడ కూర్చున్న పది నిముషాలలోను శేషగిరి మాకు ఒక అర నిముషం కూడా స్పేర్ చేయలేకపోయాడు. నాకు వొళ్ళంతా మంటలు మండినట్లయింది. డర్టీ రాస్కెల్ ! అంతా, తెచ్చిపెట్టుకున్న బిజీనెస్ అని నేను గ్రహించకపోలేదు.

'వస్తాం, శేషగిరీ.' అని లేచి నిలబడ్డాను. నాతోపాటు సుబ్రమణ్యమూ.

'ఓ.కే ! చూస్తు వున్నారుగా. క్షణం వూపిరాడదు' అని, 'అలాగే పోయిరండ్రా, బికారి వెధవల్లారా' అన్నట్టు చూపు విసిరి, చేయి వూపి అనుమతిని మంజూరు చేశాడు శేషగిరి. బయటికి వచ్చాము.

'ఈ శేషగిరిగాడు, ఎంత మారిపోయాడ్రా !?' అన్నాను ఆశ్చర్యాన్ని అవుకోలేక.

'అందుకే, నేను వద్దన్నాను' అన్నాడు సుబ్రమణ్యం. ఆ మాట నిజమే. శేషగిరిగాడు పెద్ద క్లాత్ బిజినెస్‌మాగ్నెట్ అయ్యాడంటే — ఎగిరి గంతేసి — వద్దంటున్నా వినకుండా, శేషగిరిని చూసి తీరాలని పట్టుబట్టినందుకు నాకు గట్టిగానే చెంప దెబ్బతగిలింది. ఆ వూళ్ళోనే గుమాస్తాలుగా ఏడుస్తున్న మా రాజానీ, రంగణ్ణీ చూద్దామన్న సుబ్రమణ్యం మాటని నేను తోసిపారేసాను. శాస్తి జరిగింది.

జీవితంలో కొన్ని కొన్ని సంఘటనలు యాదృచ్ఛికంగా జరిగిపోతుంటాయి. అనుకున్న దొకటయితే జరిగేది మరొకటిలాగ వుంటుంది. బందరు వెడదామని బయలుదేరినవాణ్ణి—రైలు ఆ వూరి స్టేషన్లో ఆగగానే—నా మనసును తాళ్ళు కట్టి బలంగా లాగినట్లనిపించింది — ఒక సెంటిమెంటు, ఒక చిన్న ఆపేక్ష నా గుండెలలో అలజడి రేపగా—బ్రీఫ్‌కేసు తీసుకుని అర్ధాంతరంగా ఆ వూళ్ళో దిగిపోయేను. అదృష్టం కొద్దీ సుబ్రమణ్యం వూళ్ళోనేవున్నాడు. కాలకృత్యాలు తీర్చుకున్నాక వూరు చూసివద్దామని బయలుదేరాము. ఆనాటి మా కాలేజి బిల్డింగు బోసిపోయినట్టుగా వెలిసిపోయి మసిగొట్టుకునివుంది. ఆ బిల్డింగు వైపుచూస్తూ వుంటే దిగులుగా అన్పించింది. ఇపుడు అక్కడ ఫుడ్ కార్పొరేషను గోడవునులు చోటు చేసుకున్నాయట. వూరి బయట స్వంత బిల్డింగులు కట్టుకుని కాలేజీ అక్కడికి మారిందని అన్నాడు సుబ్రమణ్యం. కాలేజికి ఎదురుగావుండే కాకా హెూటళ్ళు, కిళ్ళీకొట్లు అక్కడలేవు. కాలేజీ ప్రక్కగా పారుతూవున్న పంటకాలువ మాత్రం కొబ్బరిచెట్లతో నిండుగా అలాగేవుంది. కొబ్బరి చెట్లు మాత్రం ముసిలివయిపోయాయి. ఆ ప్రక్కన పచ్చగ కళకళలాడుతూ వుండే పంటపొలాలు పోయి అక్కడ ఇళ్ళు వెలిసాయి. వూరు పెరిగింది. ఆకారం మారింది. ఆ కాలవగట్టున వంతెనమీద కూర్చుని చాలాసేపు మాట్లాడుకున్నాము. జ్ఞాపకాల్ని నెమరు వేసుకున్నాము. మాట్లాడింది నేను. అదంతా విన్నవాడు, సుబ్రమణ్యం. ఆ తర్వాత ఇద్దరం కలిసి వూరంతా తెగతిరిగాము. సెంటర్లో శంకర విలాస్ అలాగే వుంది. ఆ ప్రక్కనవుండే బట్టలషాపు మాత్రం మారిపోయింది. డాబా స్థానంలో మేడ వచ్చింది — ఎయిర్ కండిషనింగ్ చేశారుట. ఆ ప్రక్కనవుండే బస్టాండు వూరి బయటికి మార్చారుట. అలనాటి రెండు సినిమా హాళ్ళూ వెలిసిపోయి కళతప్పి అలాగే మురిగ్గా, ముసిలితనం వచ్చి నిలబడివున్నాయి. వాటికి జతగా, హంగామాగా మరో మూడు కొత్త సినిమాహాళ్ళు వచ్చాయి. రోడ్డు ప్రక్కన వుండే పాకలు పోయి షాపులు వచ్చాయి. గతుకుల మురికి రోడ్డుకి తారుపడి, మెయిను బజారు అన్పించుకునే అర్హత సంపాదించుకుంది. వూరు మారింది. బాగా మారింది. అదీ దాని పరిస్థితి. ఎన్నాళ్ళకి చూసాను — మళ్ళీ !

వూరంతా తిరిగి తిరిగి కాళ్ళకి దుమ్ము గొట్టుకుని—భోజనం వేళకి సుబ్రమణ్యం ఇంటికి చేరాము. కాళ్ళు కడుక్కున్నాక, భోజనానికి పిలిచాడు సుబ్రమణ్యం. పీటలమీద కూర్చుంటూనే నోరూరించే వాసనలు ! వేడి వేడి అన్నం,

# ఇప్పుడు రుచికరమైన కస్టర్డ్ క్రీమ్ బిస్కట్‌లోని శ్రేష్టమైన కోట్టయం ఏలక్కాయ మాధుర్యాన్ని ఆనందించండి



ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు
అందిస్తున్న అద్భుతమైన విందు ...
గోధుమరంగు-నలుపుగల
శ్రేష్ఠమైన కోట్టయం ఏలక్కాయలలోని
నూనెసారము చేరి దళసరిగా,
పోషకశక్తితోవున్న కస్టర్డ్ క్రీమ్,
కరకరలాడే రెండు బిస్కట్ల మధ్య
అందవేయబడుతుంది.
అదే ట్రూ ఏలక్కాయ కస్టర్డ్ క్రీమ్.
ప్రకృతిలోని అత్యుత్తమమైన
దానితో అద్భుతంగా తయారుచేయ
బడింది.
ప్రత్యేకమైన సెల్లోఫేన్
ప్యాక్‌లో ఏలక్కాయల పూర్తి
సువాసనతో మీ కోసం తాజాగా
భద్రపరచబడింది.







**TRUE**

## ఏలక్కాయ కస్టర్డ్ క్రీమ్

మీరు మటుకే చెప్పగల ప్రత్యేక రుచి




**ఆరోఫుడ్ ప్రైవేట్ లిమిటెడ్**

భారతదేశపు అత్యాధునిక పిండిమర మరియు
బిస్కట్ తయారుచేసే సముదాయం

HTM-AFL-2360

## "వీణ" వింటే "వీణ" వాయిస్తే కొన్ని రోగాలు నయం కావచ్చును!

**సంగీతం రోగ ఉపశమనం చేయగలదా!?**

పై విషయంలో అన్వేషణలు జరపటానికి ఒక అమెరికన్ యువతి మదరాసు వచ్చింది. ఈమె పేరు హోప్ ఏవా కెల్మెన్, మిషిగన్ యూనివర్సిటీ రీసెర్చి స్కాలర్.

"వీణ" నాదానికి ఈ మహత్తర శక్తి ఉన్నదని కెల్మెన్ అభిప్రాయం. "సరస్వతి — ది హీలింగ్ పవర్ ఆఫ్ మ్యూజిక్" అనే అంశంపై ఈమె మదరాసులో పరిశోధనలు చేస్తున్నది.

"వీణ నేర్చుకొనటానికి చాలా కాలం పడుతుంది. వీణ వాయించగలనన్న మధుర భావన నాలో ఏర్పడిన మరుక్షణమే నాలోని అన్ని రుగ్మతలు తొలగిపోయాయి. అది నాలో ఏర్పడిన మానసిక భావన కావచ్చు. అయినా ఆ భావన నా శరీరాన్ని ప్రక్షాళన గావించింది" అంటుంది కుమారి కెల్మెన్.

మూడు కోణాల నుంచి ఈమె తన పరిశోధనా కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నది. కళ, మానసిక శాస్త్రం, తత్త్వ శాస్త్రం — ఈ మూడు శాస్త్రాలను ఒకేసారి అధ్యయనం చేస్తూ, సంగీతం సహాయంతో మానసిక సమస్యలను పరిష్కరించటానికి మిస్ కెల్మెన్ కృషి చేస్తున్నది.

ఇదొక అసాధారణ సిద్ధాంతం. ఈ సిద్ధాంత రూపకల్పనలో కళాక్షేత్ర, మదరాసులోని యూనివర్సిటీ వుమన్స్ ఎసోసియేషన్ ఈమెకు తోడ్పడుతున్నాయి. ఈ ఎసోసియేషన్ మిస్ కెల్మెన్‌కి 4,800 రూపాయల ఉపకార వేతనం మంజూరు చేసింది. యూనివర్సిటీ వుమన్స్ ఎసోసియేషన్ల ఇంటర్నేషనల్ ఫెడరేషన్‌లో ఈ ఎసోసియేషన్‌కి భాగస్వామ్యం ఉన్నది.

మిస్ కెల్మెన్, మిషిగన్ యూనివర్సిటీలో ఎడ్యుకేషన్ సైకాలజీలో గ్రాడ్యుయేటు చదువులు సాగిస్తూ, "వైద్యానికి కళలు" అనే అంశంమీద కూడా కృషి చేస్తున్నది. "వ్యాధిని కుదర్చటంలో సైకాలజీ ఎలా పనిచేస్తుందో పరిశోధించాలనుకొంటున్నాను. ఇందుకు సంగీతం ఎంతవరకు తోడ్పడగలదో చూడాలనికూడా నా అభిలాష" అంటుందామె.

"వీణ వాయించటం ఒక ఆధ్యాత్మిక సాధనలాంటిది. దీనిద్వారా మానసిక ఏకాగ్రత సాధించవచ్చు" అంటుంది మిస్ కెల్మెన్.

మిస్ కెల్మెన్ ఇండియాకు రాక పూర్వం మేసచుసెట్స్‌లోని యామ్‌హెర్స్ట్ సంగీత పాఠశాల అధ్యక్షులు ప్రొఫెసర్ డేవిడ్ రెక్ దగ్గర వీణా వాద్యంలో ప్రాథమిక పాఠాలు అభ్యసించింది. ప్రొఫెసర్ రెక్ కూడా పది, పన్నెండేళ్ల క్రితం కళాక్షేత్రంలో వీణ నేర్చుకొన్నారు. "నిజానికి నేను బౌద్ధ తత్త్వంలోని టిబెట్ వైద్య విధానం అధ్యయనం చేయాలనుకొని ఇండియా వచ్చాను. ఇక్కడికి వచ్చిన తరువాత వీణా వాద్యం నన్ను ఆకట్టుకొన్నది" అన్నది మిస్ కెల్మెన్.

కళాక్షేత్రంలో శ్రీ టి. ఎన్. రామచంద్ర అయ్యర్ శిష్యురాలుగా కుమారి కెల్మెన్ చేరింది. కుమారి కెల్మెన్ పూర్తి శాకాహారి. కళాకారుల కుటుంబంలో ఈమె జన్మించింది. ఈమె తల్లి నర్తకి. మిస్ కెల్మెన్ కూడా నృత్యం చేయగలదు, పియానో కూడా వాయిస్తుంది.

సంగీతం మృదువుగా, లలితంగా, శ్రావ్యంగా ఉండాలని కెల్మెన్ అంటుంది. నేటి పాశ్చాత్య తరహా "ఢావ్‌" ఢావ్‌ సంగీతం ఈమెకు నచ్చదు.

[భాస్కరన్ తామస్]

---

## ఇది ఆట కాదు

దోసకాయ పచ్చడి, ఆవకాయ, వంకాయ వేపుడు, బీరకాయ కూరా, కమ్మటి నెయ్యా, పులుసూ, మజ్జిగచారు, వడియాలు, పెరుగూ. మజ్జిగచారు నాకు చాలా ఇష్టమని లలితకి బాగా తెలుసు. లలిత నన్ను మరిచిపోలేదు! ఆ అమ్మాయి సుబ్రమణ్యం చెల్లెలు. మా నాన్నగారు ఆ వూళ్ళో చాలాకాలం వుద్యోగం చేసారు. వుద్యోగస్తుడి కొడుకును గనుక నేను, ఐరన్ చేసిన బట్ట నలగకుండా నీట్‌గా ట్రిమ్‌గా వుండేవాణ్ణి. సుబ్రమణ్యం వాళ్ల ఇల్లు మా ఇంటి ప్రక్కనే. మాది డాబా ఇల్లు. వాళ్లది వంగి వాలిపోయిన పెంకుటిల్లు. సుబ్రమణ్యం నాన్న ఏదో చిన్న ఉద్యోగం చేస్తూ, సుబ్రమణ్యాన్ని అతికష్టంమీద చదివిస్తూ వుండేవారు. లలిత చామనచాయ రంగులో వుండేది. కాని ఆ పిల్లని చాలా పెద్ద అందమయిన కళ్ళు, ముక్కు, పెదాలు చాలా ఆకర్షణీయంగా వుండేవి. తుమ్మెద రెక్కల్లాంటి వొత్తయిన గిరజాల జుత్తు, కుదమట్టమయిన శరీరం. అప్పుడప్పుడే యవ్వన ప్రాదుర్భావ దశలో అడుగు పెడుతూవున్న ఆ అమ్మాయి నన్ను ఆకర్షించిందనాలి. నేను తరచూ సుబ్రమణ్యంగారి ఇంటికి వెళ్తూ వుండేవాణ్ణి. అందుకు సుబ్రమణ్యంతో నా స్నేహం ఒక సాకు మాత్రమే. ఆ ఇంట్లో నాకు బాగా మర్యాదలు జరిగేవి. సుబ్రమణ్యంతల్లిడబ్బాల్లోంచి చేగోడీలు, కారప్పూస తెచ్చిపెట్టి తినమని బలవంతం చేసేది. ఆప్యాయంగా మాట్లాడేది. సుబ్రమణ్యం తండ్రి గొప్పగా కబుర్లు చెప్పేవాడు. ఎంతో అభిమానాన్ని గుమ్మరించేవాడు. ఆ మర్యాదల్ని అందుకుంటూ గర్వంగా పోజులు కొట్టేవాణ్ణి నేను.

నేను తరచూ వాళ్ల ఇంటికి వెళ్లటం మా అమ్మకి ఇష్టం వుండేది కాదు. ఆ విషయంలో ఆమె నన్ను ఒకటి రెండుసార్లు హెచ్చరించింది. కాని ఆమె మాటల్ని నేను పెడచెవిని పెట్టాను. అందువలన ఆమె మా నాన్నకి ఎక్కించింది. మా నాన్న గొప్ప లౌక్యుడు. అందువలన మాటల్ని మాలలుగా కట్టి నా మనసుని మార్చటానికి ప్రయత్నించాడాయన.

వాళ్లు పేదవాళ్లు. మేము వున్నవాళ్లము. మాకూ వాళ్లకీ చాలా అంతరముంది. అందువలన అటువంటి వాళ్లతో మాకు సంబంధాలు వుండరాదు. తక్కువ అంతస్తు గలవాళ్లకి పై అంతస్తు వాళ్ల మీద కొన్ని దురాశలు వుండే అవకాశం వుంది. వాళ్ల మాటల్లో, చేతల్లో, మర్యాదల్లో— ముసుగు కప్పుకున్న ఒక ఆశాపాశం వుంటుంది. ఆ వలలో తగుల్కోకుండా తప్పించుకుని తిరగటం తెలివి గల వాళ్ల లక్ష్యం — ఇదీ ఆయన మాటల సారాంశం. అందుకు ఎన్నో దృష్టాంతాల్ని తన అనుభవాల్నుంచి ఎత్తి చూపించారాయన. అంతా చెప్పి— నీవూ తెలీనివాడివిగాడు. పెద్దవాడివవుతున్నావు. ఆలోచించి నిర్ణయించుకోదగిన స్థాయికి ఎదుగుతున్నావు. నీకు నువ్వే నిర్ణయించుకో — అంటూ లౌక్యంగా జారుకున్నారు. నేను ఆయన మాటల గురించి ఆలోచించాను. నిజమే. అందులో కొంత వాస్తవం వుండక పోలేదు.

వాళ్ల మాటలు, ఆప్యాయతలు, మర్యాదల వెనుక ఒక లక్ష్యం లేకపోలేదనిపిస్తుంది. లలితకీ నాకూ ఈడూజోడూ. నేను లలితని పెళ్లి చేసుకుంటే వాళ్ళు ఎంతో సంతోషిస్తారు. గుండెలమీద కుంపటిని వదిలించుకుని తృప్తిగా నిట్టూర్చే అదృష్టాన్ని అందుకోగలరు. ఆ అభిప్రాయం సుబ్రమణ్యం తలిదండ్రుల మనసులో వుందని నాకు తెలుసు. నాకు ఇంకో విషయం కూడా తెలుసు. ఎప్పటికీ వాళ్లు బయటపడలేరు. నోరు విడిచి, 'మా లలితని చేసుకోరాదా' అని నన్ను వాళ్లు అడగలేరు. అందుకు పెద్ద 'రీజను' వుంది. లేనివాడికి వున్నవాణ్ణీ, బలహీనుడికి బలవంతుణ్ణీ చూస్తే కలిగేది పిరికితనం. అలాగే పెంకుటింటి ఫెలోకి డాబావాణ్ణి చూస్తే భయం. ఆ రకమయిన దిగులూ, ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సూ వాళ్లని అలుముకుని వుంది. నేను అందగాణ్ణి! అన్నీ వున్నవాణ్ణి అన్న ఆ గర్వం, దర్పం నాలో పుష్కలంగా వున్నాయి నా రక్తంలోనే వుంది. నా పెరుగుదలతోనే అవి పెరిగి మరింత బలంగా రూపుదిద్దుకుంటున్నాయి కాని అవి బయటపడవు. అది నా అభిజాత్య లక్షణం ఏమీ తెలియని అమాయకుడిలాగ పైకి నటిస్తూ ఇన్ని రకాల ఆలోచనలకి బుర్రలో చోటిస్తూవున్న నన్ను గురించిన వాళ్ల అంచనా ఎటువంటిదయినా నన్ను నిలవేసి అడిగే ధైర్యం వాళ్లకి లేదు. తీరా బయటపడి అడిగితే — ఒకవేళ నేను తిరస్కరిస్తే వాళ్ళు వెలితిపడటమే మిగిలేది. అందువలన ప్రస్తావన వచ్చేదిగాదు.

[44వ పేజీ చూడండి]




కొత్తది. సున్నితమైన డెట్టాల్ సబ్బు.
మీ కుటుంబానికి ప్రీతితో లాలిస్తూ
సంరక్షించే ఈ సబ్బును సమకూర్చండి.
చర్మానికి, రూపానికి సంరక్షణ కోసం
శుభ్రత, ఆరోగ్యం కోసం ప్రతిరోజూ.
ప్రీతితో లాలిస్తూ సంరక్షించే డెట్టాల్ సబ్బు

## మీ కుటుంబానికి లాలించే సంరక్షించే డెట్టాల్ సబ్బును సమకూర్చండి.



ఎన్నికచేయబడిన కొన్ని పట్టణాలలోనే దొరుకుతుంది.

Rediffusion/D/1184 dTL





## చరిత చిత్ర కంబైన్స్ మరో కురుక్షేత్రం

తమ్మారెడ్డి వి. కె. నిర్మించే "మరో కురుక్షేత్రం" చిత్రం షూటింగ్ జూన్ 1 నుంచి 30 వరకు హైదరాబాద్‌లో ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుందని భరద్వాజ తెలియజేశారు. మాదాల రంగారావు, శారద, నూతన్‌ప్రసాద్, పి. ఎల్. నారాయణ, భానుచందర్, సాయిచంద్, మరో నూతన నటి పాల్గొంటారు. తాతినేని చలపతిరావు సంగీతం, రామారావు ఛాయ, హరి కూర్పు, రవి నృత్యాలు నిర్వహిస్తారు. "ఒక సంచలన దర్శకుడు ఈ చిత్రానికి పనిచేస్తారు. ఈ చిత్రం ద్వారా మల్లిక్ అనే కొత్త రచయితను కూడా పరిచయం చేస్తున్నాం," అంటూ భరద్వాజ "లోగడ ఇదే టైటిల్‌తో ఒక చిత్రాన్ని దాసరిగారి పర్యవేక్షణ, శ్రీ రేలంగి నరసింహారావు దర్శకత్వంలో తీయ దలిచాం. కాని, చిత్ర కథలో వచ్చిన మార్పుల వల్ల ఆ చిత్ర నిర్మాణానికి తాత్కాలికంగా వాయిదా వేయవలసివచ్చింది. ఇదే టైటిల్‌ను నేను ఏడు మాసాల క్రితమే మా చరిత చిత్ర పేరిట దక్షిణ భారత చలన చిత్ర వాణిజ్య మండలి కార్యాలయంలో రిజిస్టర్ చేసి ఉంచాం. అందుచేత, ఈ టైటిల్‌ను వాడుకునే హక్కు మా ఒక్కరికే ఉంది," అన్నారు. ఈ విషయాలను ఆయన, లోగడ ఇదే సంస్థకు కట్టా సుబ్బారావు దర్శకత్వం నెరపిన "మొగుడు కావాలి" 150 రోజుల వేడుక సందర్భంలో ప్రకటించారు. ఈ 150 రోజుల పండుగ ఇటీవల మద్రాసులో విమానాల సంబరాలు జరిగింది. చిత్రం ప్రారంభం నుండి విడుదలయ్యే వరకు చిత్ర నిర్మాణంలో పరోక్షంగా పాలు పంచుకునే సాంకేతికేయులచేత నటీనటులకు, సాంకేతికనిపుణులకు, థియేటర్ యజమానులకు షీల్డులు ఇప్పించడం అందులోని విశేషం. ఈ ఉత్సవానికి 'కాగడా' శర్మ అధ్యక్షత వహించారు.

## టాక్సీ డ్రయివర్‌లో త్రిమూర్తులు

భాస్కరరావు (రావు గోపాలరావు), లింగరాజు (అల్లు రామలింగయ్య), మోహన్ (మోహన్‌బాబు) కూర్చొని మద్యం సేవిస్తున్నారు. భాస్కరరావు గుటకెడు మింగి, "మందు వేసేటప్పుడు త్రీచీర్స్— అని అంటూంటాం కదా? నిజంగా దాని అర్థమేమిటో నీకు తెలుసా, లింగరాజా? త్రీచీర్స్ – అంటే, తెలుగులో 'త్రిమూర్తి పూజ' అని అర్థం... ఫస్ట్ రౌండ్ – బ్రహ్మదేవుడిది. అంటే, ఒంట్లో కెళ్లి వేడి పుట్టించడానికి పనికొస్తుంది. సెకండ్ రౌండ్ – విష్ణుమూర్తిది. అంటే, మన విశ్వరూపం మెల్లిగా ఓపెనింగ్ అవుతూంటుందన్న మాట! ఇంక థర్డ్ రౌండ్ – పరమశివుడిది. అంటే, అది పడిం తర్వాత శివతాండవం ఆడెయ్యడానికి రెడీ అయిపోతామన్నమాట!" అన్నాడు.

లింగరాజు త్రేన్చుతూ, "వెరీ గుడ్! ఆ రాజాగాడి పీడ విరగడైన శుభ సందర్భంలో మనందరం శివతాండవం ఆడెయ్యాలి, భాస్కర్రావ్, నిజంగా నీ బుర్రని తీసుకెళ్లి, మ్యూజియంలో పెట్టాలయ్యా," అన్నాడు.

"ఇంకా నయం – నా బాడీని తీసుకెళ్లి 'జూ'లో పెట్టాలన్నావు కాదు," అని భాస్కరరావు నవ్వుతూండగా ఆయన కూతురు జయ(జయప్రద) మెడలో మెరిసిపోయే నెక్లెస్‌తో అక్కడికి వచ్చి, "ఈ వజ్రాల నెక్లెస్ ఎలా ఉంది, డాడీ?" అంది.

"ఎప్పుడు కొన్నావమ్మా?" భాస్కరరావు అడిగాడు.

"నేను కొనలేదు, డాడీ! నాకు కాబోయే భర్త కొన్నారు," అంది జయ సగర్వంగా.

లింగరాజు సంభ్రమంతో తన కొడుకు మోహన్ వంక తిరిగి, "ఏరా, నాకు తెలియకుండా ఎప్పుడు కొనిచ్చావ్?" అన్నాడు.

"నేనివ్వలేదే!" అన్నాడు మోహన్ నిర్ఘాంతపోతూ.

భాస్కరరావు ఉలిక్కిపడ్డాడు. "నువ్వివ్వలేదా? మరైతే ఎవరిచ్చారు?"

ముగ్గురూ ఒకరి ముఖాలొకరు తెల్లబోతూ చూసుకున్నారు.

"ఆ నెక్లెస్ కొనిచ్చింది ఇంకెవరో కాదు; హీరో అయిన టాక్సీ డ్రయివర్ రాజా (కృష్ణంరాజు)," అని తెలియజేశారు డైరెక్టర్ ఎస్. పి. చిట్టిబాబు. విశ్వచిత్ర సినీ ఎంటర్‌ప్రైజెస్ వారి "టాక్సీ డ్రయివర్" చిత్రానికి జి. ఆర్. కె. రాజు నిర్మాత.

'బంగారు !







## గడసరి అత్త — సొగసరి కోడలులో
## పెదసర సమస్యకు దశసరి పరిష్కారం

సూర్యం (కృష్ణ)ను చూసి అప్పారావు (పి. ఎల్. నారాయణ) "మా వరాల్ని నీకిచ్చి చెయ్యాలని చిన్నప్పటినుంచి అనుకున్నదేగా? మరి, ముహూర్తాలు పెట్టించనుంటావా?" అడిగాదు

పక్కనే ఉన్న సూర్యం తల్లి సుందరమ్మ (భానుమతి) "ఆగు! తొందరపడ్తావేం? వాడితోటి మాట్లాడాలి, ఆయనతోటి మాట్లాడాలి," అంటూ భర్త రంగయ్య (నాగభూషణం) వంక తిరిగి, "ఏవండీ, ఏవంటారు?" అంది.

"నేనేవంటాను? నువ్వేం చెప్తే దానికి తందాన తాన — అంటాను," అన్నాదు రంగయ్య

"నాన్నా! అమ్మ చెప్పిందానికి నువు తందాన తాన అన్నా, నేను మాత్రం అలా అనలేను," అన్నాడు సూర్యం.

"ఇదేదో సినిమా డైలాగ్‌లా ఉందే?" అంది సుందరమ్మ.

"అక్కయ్యా, ఏందీ దారుణం? ఈ పెళ్ళి జరగదా?" అప్పారావు అడిగాడు.

"ఏవిటా ఈ అపశకునపు మాటలు? పెళ్ళిళ్ళు జరుగుతాయి. అది కాదు ఇప్పుడు నీ కూతురు కొంచెం కాకని.. మా అబ్బాయి.. కొంచెం.." చెప్పలేక చెప్పింది సుందరమ్మ.

ఆ మాటకు వరాలు (రమాప్రభ) ఏడ్పు లంకించుకుంది.

"మరి, నా యాభై ఎకరాలు?" ఏడ్పు ముఖం పెట్టాడు అప్పారావు.

"ఓరి నీ యాభై ఎకరాలు మండిపోనూ — యాభై ఎకరాలతో ప్రపంచాన్నే కొనేట్టున్నావ్ ముష్టి యాభై ఎకరాలతో ఏమౌతుంది ఈ రోజుల్లో? ఒకసారిచ్చింతర్వాత అస్తమానం నా నా నా అంటావేంటి? మా మా మా.. మా — అంటే. మా భూమి, మా దేశం, మా ఇల్లు," అంటూ వరాలు చెయ్యి పట్టుకొని, "నువు టిఫిన్ తిన్నావా? పో! వెళ్ళి టిఫిన్ తిను," అంటూ లాక్కెళ్ళిపోయింది సుందరమ్మ అప్పారావు అనుసరించాడు

సూర్యం, తండ్రితో "నాన్నా! మేం ఈ తరానికి కొత్త మనుషులం మాకంటూ వేరే కొత్త దారి ఉంది. ఆ దారిలోనే నేను ప్రయాణం చెయ్యాలి చేస్తాను," అన్నాడు.

కొడుకు దృఢ నిశ్చయానికి రంగయ్య సంతృప్తి చెందాడు.

కట్టా సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో గోరంట్ల పిచ్చయ్యచౌదరి, సోమిశెట్టి సుబ్బారావు నిర్మించే రాధాకృష్ణ క్రియేషన్స్ "గడసరి అత్త — సొగసరి కోడలు"లో అత్తా కోడళ్ళుగా భానుమతి, శ్రీదేవి నటిస్తున్నారు

ఆ చివర:
'చిన్నారి చిట్టిబాబు'లో కవిత
మధ్య
'సి ఐ.డి. సికిందర్'లో అంబిక
ఈ చివర:
'చిన్నారి చిట్టిబాబు'లో మమత

...కొడుకు'లో ఒక దృశ్యం



## దాసరి రచన — పర్యవేక్షణ, దుర్గా దర్శకత్వంలో వై. సునీల్‌చౌదరి చిత్రం

"జయసుధ, మురళీమోహన్‌లు హీరో హీరోయిన్‌లు. మోహన్‌బాబుది డ్యుయెల్ రోల్ నాగేష్ కమెడియన్," అన్నారు దాసరి నారాయణరావు ఈ రచన మాటలు, పాటలు, దర్శక పర్యవేక్షణలో సత్యనారాయణ ప్రొడక్షన్స్ తయారుచేసే చిత్రానికి లోగడ "మేనకోడలు, బలిపీఠం, బంగారక్క" చిత్రాలను అందించిన వై. సునీల్‌చౌదరి పుత్రుడు వై. శ్రీనాథ్ నిర్మాత ఎం. ఎస్. విశ్వనాథం సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, భాస్కరరాజు శిల్పం, కె. సత్యం కూర్పు ఇతర హంగులు "పరుచూరు గ్రామంలో మే 27న షూటింగ్ మొదలెడుతున్నాం. ఆ ప్రాంతాల్లోనే జూన్ 10 వరకు తొలి షెడ్యూల్ జరుగుతుంది. జూన్ 16 నుంచి 21 వరకు జరిగే రెండవ షెడ్యూల్‌లో మూడు వంతులకు పైగా పూర్తవుతుంది,' అన్నారు డైరెక్టర్ దుర్గా నాగేశ్వరరావు.

# సినిమా

### భోగ భాగ్యాలులో రాధా కృష్ణులు

ఆ ఇంట్లోంచి వినిపించే మధురమైన గానానికి ముగ్ధుడైపోయాడు కృష్ణ (కృష్ణ). రామదాసు (రావి కొండలరావు) వచ్చి పలకరించేసరికి "ఆ పాట ..." అన్నాడు కృష్ణ.

"నా కుమార్తెయే ! సంగీత నిధి ..." అని రామదాసు అంటూండగా రాధ (శ్రీదేవి) వచ్చి, కృష్ణను చూసి బెదిరిపోయింది. "నా శిష్యుడమ్మా!" అంటూ ఆమెకు కృష్ణను పరిచయం చేశాడు. కాని, రాధ సీరియస్‌గా లోపలికెళ్ళిపోయింది.

"రావోయ్ ! కూర్చో !" అంటూ రామదాసు వయొలిన్ అందుకొని, "శ్రీరాగంలో మన ఆంధ్రుడు వేమూరి గగ్గయ్య ఘటికుడు. గగ్గయ్య లాగా రాగాన్ని గదుముతాను కాచుకో !" అంటూ వయొలిన్ వాయించసాగాడు.

కృష్ణ భరించలేకపోయాడు. అతని దృష్టంతా రాధమీదే ఉంది. మధ్యలో పానకంలో పుడకలా రామదాసు గొడవ ... కళ్ళు మూసుకున్నాడు. ఇంతలో వయొలిన్ తీగ తెగిపోయేసరికి ఆనందంతో కళ్ళు తెరిచాడు.

"పాడు తీగలోయ్ ! సూపర్ తిండి తిన్న మనుషుల్లాగే వీటిల్లో కూడా పవర్ చచ్చిపోయింది," అన్నాడు రామదాసు.

'బ్రతుకుజీవుడా' అనుకుంటూ కృష్ణ "రేపు మరో గట్టి తీగ తెస్తాను, మాస్టారూ !" అంటూ చల్లగా జారుకున్నాడు.

ఎస్. పరంధామరెడ్డి నిర్మించిన ఎస్. ఎల్. మూవీస్ "భోగ భాగ్యాలు" చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

### సీతాకోక చిలకలో శ్రీరంగనీతులు

కరుణ (అరుణ)ను చూసి మేరీ (స్మిత) నివ్వెరపోయింది. "మీ అన్నయ్య నిన్ను గొడ్డును బాదినట్టు బాదినా – ఉలక్కుండా, పలక్కుండా నల్లరాయిలా ఉండిపోయావు. అసలు ఏమిటి నీ ఉద్దేశ్యం ?"

"దెబ్బ తగిలేటప్పుడు అమ్మను తల్చుకుని ఉంటే, ఏడుపొచ్చేది. కాని, నేను నా రఘుని తల్చుకున్నాను. ఎంతో సంతోషంగా అన్పించింది." తాపీగా సమాధానమిచ్చింది కరుణ.

"ఆ దరిద్రుడ్ని మరిచిపొమ్మనే ఇన్ని దెబ్బలు కొట్టింది. నువ్వింకా ఇలాగే వాగుతూ ఉంటె, మీ అన్నయ్య మీ ఇద్దర్నీ చంపి, సముద్రంలో పారేస్తాడు."

"చంపనీ, వదినా ! కాల్చి మసి చేసి సముద్రంలో కలిపెయ్యనీ. అప్పుడు హద్దులు లేని సముద్రమే మా కిల్లవుతుంది."

"నీకేమన్నా పిచ్చి పట్టిందా ?"

"అవునొదిన , పిచ్చిదాన్నే; ప్రేమ పిచ్చిదాన్ని. మీరు పెద్దవాళ్ళ చేతుల్లో పావులు. మీ పెళ్ళికి ముందు నీ మెళ్ళో ఎన్ని కాసుల బంగారం ఉందా అని మా నాన్న చూశాడు. మాకెంత ఐశ్వర్యం ఉందా అని మీ నాన్న చూశాడు. మీరు ఆస్తిపాస్తులు చూసి పెళ్ళి చేసుకున్నారు. మేము మనసులు తెలుసుకుని ప్రేమించుకున్నాం... ఊరుకున్నావేం, వదినా ? నీ వాటా దెబ్బలు నువ్వూ కొట్టు. కొట్టినా, కోసేసినా సరే – నేను 'రఘూ ! రఘూ !' అంటూనే చస్తాను," అంటూ కరుణ వెళ్ళిపోయింది.

మేరీ స్థాణువులా నిలుచుండిపోయింది.

ఏడిద నాగేశ్వరరావు నిర్మించే పూర్ణోదయా మూవీ క్రియేషన్స్ "సీతాకోక చిలక"లో శరత్‌బాబు, సాక్షి రంగారావు, రాళ్ళపల్లి, జానకి, కొత్త నటుడు మురళి నటిస్తున్నారు. జంధ్యాల మాటలు, వేటూరి పాటలు, ఇళయరాజా సంగీతంతో భారతీరాజా దర్శకుడు.

# సినిమా

## దాసరి దర్శకత్వంలో ధర్మేంద్ర, జితేంద్ర నటించే విజయమాధవీపిక్చర్స్ హిందీ చిత్రం "ధరమ్ – జీత్"

ధర్మేంద్ర, జితేంద్ర సరసన మౌసమీఛటర్జీ, రీనారాయ్ నాయికలు "సెప్టెంబర్ 26న షూటింగ్ మొదలెస్తున్నాం," అన్నారు నిర్మాత వడ్డే శోభనాద్రి. దాసరి స్క్రిప్ట్, డైరెక్షన్‌లో వడ్డే కిశోర్ సమర్పిస్తారీ హిందీ చిత్రాన్ని నిర్వహణ. వడ్డే రమేష్.

'సాలా – సీతా'లో జయప్రద

## దాసరి – ఎన్.టి.ఆర్. కాంబినేషన్‌లో వడ్డే రమేష్ చిత్రం బొబ్బిలి పులి

"70 ఎం ఎం స్టీరియోఫోనిక్ సౌండ్ సిస్టమ్‌లో తీస్తాం," అన్నారు వడ్డే శోభనాద్రి ఈయన సమర్పించే విజయమాధవీ కంబైన్స్ "బొబ్బిలి పులి" చిత్రంలో ఎన్ టి. ఆర్ సరసన శ్రీదేవి నాయిక "ఆగస్ట్ నుంచి ప్రతి నెల 1న తేదీ నుంచి 10వ తేదీ వరకు షూటింగ్ ఉంటుంది," అన్నారు వడ్డే కిశోర్ ఈయన నిర్వహణలో దాసరి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో అక్టోబర్‌కు పూర్తవుతుందని నిర్మాత వడ్డే రమేష్ తెలియజేశారు జె వి రాఘవులు సంగీత దర్శకుడు జి జి కృష్ణారావు సంకలనకర్త.



'గిరిజా కళ్యాణం'లో సుభాషిణి

## జూన్ 12న ఓ అమ్మ కథ

"సెన్సార్‌వారు క్లీన్ సర్టిఫికేట్ ఇచ్చారు," అన్నారు నూతన్‌ప్రసాద్. ఈయన తొలిసారిగా ద్విపాత్రలు అభినయించిన పవన్ ఇంటర్నేషనల్ వారి "ఓ అమ్మ కథ" జూన్ 12న విడుదలవు తుందని నిర్మాతలు తెలియజేశారు. ఇంకా శారద, జానకి, అనుపమ, రమాప్రభ, పి. ఎల్. నారాయణ, ప్రసాద్‌బాబు, డాక్టర్ శివప్రసాద్ పాల్గొన్నారు. దాసం గోపాలకృష్ణ సంభాషణకర్త. ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీత దర్శకుడు. జె. సత్య నారాయణ ఛాయాగ్రాహకుడు. బాబూరావు సంకలన కర్త. వసంతసేన్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వి.జోషి, సి. తిమ్మారెడ్డి, ఎస్ ఆర్. వేజెళ్ళ నిర్మాతలు.

## కట్టా సుబ్బారావు చిత్రాల ప్రోగ్రెస్

డాక్టర్ టి. కె. ఎం. ఛటర్జీ నిర్మించే రాంశ్యాం ఆర్ట్ క్రియేషన్స్ – "మా పెళ్ళి కథ" షూటింగ్ పూర్తయింది. మురళీమోహన్, శ్రీధర్, నూతన్‌ప్రసాద్, శారద, రూపాచక్రవర్తి ఆదిగాగల వారున్నారు. జూన్ చివరి వారంలో విడుదల.

వెంకటేశ్వరరావు, దోగిపర్తి సోమయ్య నిర్మించే ఆలయమ్మన్ క్రియేషన్స్ "శ్రీరస్తు–శుభమస్తు" పది రీళ్ళకు పైగ పూర్తయింది. చిరంజీవి, సరిత, కవిత, సువర్ణ, నూతన్‌ప్రసాద్ ప్రభృత నటవర్గం. జూన్ నెలలో పూర్తయి, జూలైకు విడుదలవుతుంది.

శోభన్, శారద జంటలో ఎం. రామకృష్ణారెడ్డి సమర్పణలో ఎం. శ్యామలారెడ్డి నిర్మించే సుమన్ క్రియేషన్స్ చిత్రం రెండవ షెడ్యూల్ పూర్తయింది. సెప్టెంబర్ విడుదల.

# టాక్సీ డ్రైవర్

దర్శకత్వం: యస్. పి. చిట్టిబాబు

నిర్మాత: జి. ఆర్. కె. రాజు

సంగీతం: సత్యం

THARAKAPRABHU ADS




శ్రీనివాస ఫిలింస్·వీనస్ మూవీకు



'పూరికిచ్చిన మాట'లో
మాడా, రావి కొండలరావు

## సినిమా

### నారాయణరావు హీరోగా దూండి సమర్పించే చిత్రం

''జూన్ నెలలో విజయవాడ పరిసరాల్లో ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది,'' అన్నారు ధవళ సత్యం. ఈయన స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో దూండి సమర్పించే పి. శ్రీనివాసరావు అండ్ సన్స్ వారి చిత్రంలో నారాయణరావు, మేనక, పి. ఎల్ నారాయణ ఆదిగాగల వారుంటారు. సత్యం స్వరకల్పనలో ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, ధవళ సత్యం రాసిన గీతాలు మే 14, 15, 16 తేదీలలో రికార్డయ్యాయి.

### రవీంద్రనాథ్ ఠాగూర్ వివాహం

ప్రముఖ చలనచిత్ర పంపిణీ సంస్థ లక్ష్మీచిత్ర అనుబంధ సంస్థ శ్రీ పబ్లిసిటీస్ భాగస్వామి శ్రీ కాట్రగడ్డ రవీంద్రనాథ్ ఠాగూర్‌కి లక్ష్మీ ఫిలింస్ సికింద్రాబాదు మేనేజర్ శ్రీ పిడికిటి జగదీష్‌చంద్రబోస్ కుమార్తె చిరంజీవి సౌభాగ్యవతి గీతాపావనికి మే 21వ తేదీన లక్ష్మీచిత్ర అధినేత శ్రీ హరికృష్ణ ఆధ్వర్యంలో సికిందరాబాదులోని జొరాస్ట్రియన్ క్లబ్‌లో వైభవోపేతంగా వివాహం జరిగింది. ఈ వివాహానికి రాజ్యసభ సభ్యులు శ్రీ కె ఎల్ ఎన్. ప్రసాద్, నటుడు శ్రీ శోభన్‌బాబు, శ్రీ జి.వి. రాఘవేంద్రరావు, శ్రీ కె లింగమూర్తి, శ్రీ కేశవరావు, నిర్మాతలు సర్వశ్రీ ఛటర్జీ, సత్యనారాయణ, మురారి, నరసింహంనాయుడు, ముఖర్జీ, బాబు, మిద్దే రామారావు, మాధవయ్య, రాఘవ, భరద్వాజ, తమ్మారెడ్డి కృష్ణమూర్తి, జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి, దర్శకులు శ్రీ కట్టా సుబ్బారావు, శ్రీ జి. రామమోహనరావు శ్రీ గంగాధరరావు, యింకా పలువురు హాజరయి వధూవరులకు తమ ఆశీస్సులందజేశారు

( గత సంచిక తరువాయి )






















[ఇంకా ఉంది]

## ఇరుగు - పొరుగు

★ "13 ఏళ్ళుగా నా బరువు 128 పౌండ్లు మించి పెరగలేదు; తరగలేదు," అన్నారు షావుకారు జానకి. ఏది ధర్మం, ఏది న్యాయం సెట్‌లో ఆమె "మరో విషయం... చిన్నప్పుడు నేను మా ఇంట్లో అందరితో వాదించడం చూసి, 'నువ్వు వకీల్ వృత్తికే పనికొస్తావమ్మాయ్,' అనేవారు మా నాన్న. నటినై, ఎన్నో చిత్రాల్లో లాయర్ వేషాలు వేస్తున్నాను. 'బలిపీఠం'లో లాయర్‌గా 'గాంధీ పుట్టిన దేశం'లో లేడీ జడ్జిగా వేశాను. కన్నడం, తమిళ చిత్రాల్లో కూడా చక్కని లాయర్ పాత్ర ఉంటే, నన్నే బుక్ చేస్తుంటారు సాధారణంగా. 'కావ్యతలైవి' తమిళ చిత్రంలో నా అడ్వకేట్ పాత్ర చూశాక కృష్ణగిరిలోని కళైవాణి అనే యువతి లా చదివిందట. ఐతే, ఈ 'ఏది ధర్మం ఏది న్యాయం' చిత్రంలోని నా లేడీ పబ్లిక్ ప్రాసిక్యూటర్ పాత్ర నాకెంతో నచ్చింది. హిందీ 'ఇన్‌సాఫ్‌కా తరాజు' చిత్రంలో సిమి ఈ పాత్రను అత్యద్భుతంగా పోషించింది," అన్నారు.

★ నటి సిమి ఒక హిందీ చిత్రానికి కథ, మాటలు రాస్తోంది. రాజశ్రీ ఫిలిమ్స్ నిర్మించే ఒక హిందీ చిత్రానికి నటి నూతన్ దర్శకత్వం వహించబోతోంది. హీరో రాజ్ బబ్బర్ భార్య నాదిరా జహీర్ "యాహూదీకే లడ్కీ" అనే నాటకానికి దర్శకత్వం నెఱపుతోంది.

★ దాదాపు అయిదేళ్ళ తర్వాత పి. సుశీల, తమిళ నేపథ్య గాయకుడు టి. ఎం. సౌందర్‌రాజన్ కలిసి ఇటీవల "నెంజిన్ అలైగళ్" అనే చిత్రానికి డ్యూయెట్ పాడారు.

★ కె. వి. మహదేవన్ ఇంతవరకు 375 చిత్రాలకు సంగీతమిచ్చారు. వీటిలో 65 శతదినోత్సవాలు చేసుకున్నాయి. ఇది రికార్డే మరి.

★ "కొందరు సినీ కవులకు పాటకు ఐదు వేలకు తక్కువ కాకుండా ఇవ్వడంలో తప్పేమీ లేదు. అమితాబ్ బచ్చన్‌కు ఒక చిత్రానికి పాతిక లక్షలు ఇస్తున్నారంటే – అది ప్రజల అవివేకానికి నిదర్శనం," అని ప్రముఖ రచయిత, దర్శక నిర్మాత కె. ఎ. అబ్బాస్ ఒక గోష్ఠిలో అన్నారు.

★ తెలుగు నటి ప్రవీణను పరిణయమాడిన తమిళ దర్శకుడు, రచయిత, నటుడు భాగ్యరాజా త్వరలో కె. బాలచందర్ నిర్మించే చిత్రానికి దర్శకత్వం వహిస్తూ, ప్రధాన పాత్ర ధరించనున్నారు. ఈయన చిన్నప్పుడు ఇంట్లో అలిగినప్పుడల్లా ఏ విజయవాడకో, కాకినాడకో వెళ్లిపోతూండేవారట. "ఒకసారి విజయవాడలో అయిదారు రోజులపాటు సైకిల్‌రిక్షా తొక్కాను కూడా. అలా ఇతర ఊళ్ళలోని అనుభవసారమే నేడు దర్శకుడుగా నాకెంతో తోడ్పడుతోంది," అంటారాయన.

యస్.ఎల్.మూవీస్

# భోగభాగ్యాలు

కలర్

స్క్రీన్ ప్లే - దర్శకత్వం

పి. చంద్రశేఖర రెడ్డి B.A.

నిర్మాత

యస్. పరంధామ రెడ్డి B.A.,B.L.

సంగీతం : చక్రవర్తి

కెమెరా: పుష్పాల గోపీకృష్ణ

THARAKA PRABHU ADS.



శ్రీతారకరామ

నవయుగ పిక్చర్స్





'జే గంటలు'లో ఒక సన్నివేశం

తరచూ వాళ్ల ఇంటికి వెళ్ళటం, మర్యాదల్ని అందుకోవటం, లలితని చూడటం, ఆమె గొంతు వినటం నాకు ఎంతో తృప్తిని ఇచ్చేది. నా గుండెల్లో ఆనందం లావాలా పొంగి ప్రవహించేది. నా నరాలలో గొప్ప రిలీఫ్ అన్పించేది. మనసు పొరలలో అవ్యక్తమయిన అనుభూతి వ్యక్తావ్యక్తంగా దోబూచులాడేది. అందులో స్వార్థం వుంది. నా నడవడిలో సూటిదనం లేదు. ఆ కారణంగా గిల్టీగా ఫీలయినా ఆ ఫీలింగుని అణచిపెట్టి తొక్కివేసేవాడిని.

ఒకసారి నేనూ, సుబ్రమణ్యం బజారు వెళ్ళినపుడు — అతను ఎన్నో షాపులు తిరిగి కష్టపడి ఆడవాళ్లకి ఇవ్వదగిన ఒక చక్కని బహుమతిని కొన్నాడు.

'ఏవిట్రా సంగతీ?'

'ఏమీ లేదులే' అని దాటవేయబోయాడు సుబ్రమణ్యం.

'లవ్ ఎఫేరా? సీక్రెటా?!'— కన్ను గీటాను.

సుబ్రమణ్యం సిగ్గుపడి — 'నీవు అనుకున్నది కాదులే' అన్నాడు. ముడుచుకుపోయాడు.

'డొక్క చించుతాను. వెధవ్వేషాలూ నువ్వూ. నాకు తెలీదనుకున్నావా ? ఈ సంగతి మీ నాన్నకి చెప్పకపోతే అప్పుడడుగు' అని బెదిరించాను. అపుడు బయటపడ్డాడు వాడు.

'ఈ ప్రజెంటేషన్ మా చెల్లాయికిరా. లలిత టెన్తు పాసయింది. ఆ సంతోషంకొద్దీ అన్నగా చిన్న.........'

'మరి నాకెందుకు చెప్పవురా ఫూల్!' — అని వాడ్ని కోప్పడ్డాను.

సుబ్రమణ్యం నవ్వాడు. సిగ్గుపడ్డాడు. ఆ నవ్వులో నిస్సహాయత,ఆ సిగ్గులో ఇన్‌ఫీరియారిటీనెస్! లలిత టెన్తు పాసయితే, అందుకుగాను వాడు చెల్లెలికి ప్రజంటేషను ఇస్తే ఆ సంగతి వాడు నాకు చెప్పాల్సిన అవసరం ఏమిటి? చెప్పలేదని వాడ్ని నేను దబాయించటంలో ఔచిత్యం ఎంత ?

## ఇది ఆట కాదు

[ 32వ పేజీ తరువాయి]

అనిపించి నా ప్రవర్తన నాకే నవ్వు తెప్పించింది. వాడినుంచి ఆ ప్రశ్న రాదు. అందుకు కారణం వాడు నాకంటే క్రిందమెట్టులో వుండటమే. అదే లేకపోతే వాడు ఆ మాటనే అడిగి నా మొహం బద్దలుకొట్టేనంత పనిచేసేవాడు.

ఆ సాయంత్రం నేను వాళ్ళింటికి వెళ్ళి, నేను లలితకోసం తీసుకున్న 'పార్కర్ పెన్ను'ని ఆమెకి ఇచ్చి కంగ్రాట్యులేషన్స్ చెప్పాను. సుబ్రమణ్యం తలిదండ్రులుసంతోషించినట్లు కనిపించారు. ముసలావిడ రవ్వలడ్డూ, బూందీ తెచ్చిపెట్టింది. ముసలాయన సంతోషంగా కబుర్లు చెప్పాడు. సుబ్రమణ్యం వెర్రిమొహం వేసుకుని కూర్చున్నాడు. లలిత థాంక్సు చెప్పి లోపలికి వెళ్ళిపోయింది.

నాకు తెలుసు. నా మనసు లలితమీద లగ్నమయి వుంది. కాని లౌకికమయిన కొన్ని బంధనాలు నన్ను వేరే దారిని నడిపిస్తున్నాయి. కోరికను చంపుకోలేను. ధైర్యంచేసి ముందడుగూ వేయలేను. ఒక రకమయిన యువతరానికి ప్రతినిధిని నేను. ముసలాయనా, ముసలావిడా నామీద ఆశలు పెంచుకుంటున్నారు. అందుకు అవసరమయిన అవకాశాన్ని నా ప్రవర్తన కలిపిస్తూవుంది. కాని ఒక సంశయం, పిరికితనం వాళ్ళని పట్టి బంధిస్తూవుంది. వాళ్ల చూపుల్లో ఆ ఆశ దోబూచులాడుతూ వుంది. కాని అది బయటపడదు. పేదరికం లేకితనాన్ని, లేకితనం పిరికితనాన్ని పుష్కలంగా అందించగలవు. అదే నాకు శ్రీరామ రక్ష. లేకుంటే నావంటి రాస్కెల్సు మనసులోని మురికితనం ఎప్పుడో బయటపడేది. నేను మనుషులతో ఎంత క్రూరంగా ఆడుకుంటున్నాను! చంచలమయిన నా యువక మనస్సు ఎంతటి భయంకరమయిన మార్గాన ప్రయాణంచేస్తున్నది?! చివరికి నేను వాళ్లని ముంచనుగదా!

మృష్టాన్నాన్ని సుష్టుగా తిని ఆరుబయట మంచంమీద పడుకునివున్న నన్ను ఒకనాటి ఈ ఆలోచనలు దోమల్లాగ ముసిరాయి. నా మనసుకు చికాకును కలిగించాయి. ఆందోళనా భరితమయిన నా గుండెలకి మరింత గాయాలు చేసి నన్ను శిక్షించాయి.

'ఏమిటి రాజా! ఆలోచనలో పడినట్లున్నావు?' అంటూ వచ్చి నా ప్రక్క మంచంమీద పడుకున్నాడు సుబ్రమణ్యం.

'సుబ్రమణ్యం! ఏమిటి ఇంకా నీ విశేషాలూ?' అన్నాను. సుబ్రమణ్యం తన గొడవ చెప్పుకొచ్చాడు.

తండ్రి పోయాడు. కుటుంబ భారం బుజాల పైన పడింది. అందువలన పై చదువులు చదవలేక చాలీచాలని జీతం అందించే చిన్న ఉద్యోగంలో కుదురుకున్నాడు.ఏదో—జీవితం గడిచిపోతూవుంది. జీవితంలో బరువు చోటు చేసుకుంది. ఆనాటి రోజులు, ఆ స్నేహితులు, ఆ ముచ్చటలు తల్చుకుంటే దిగులుగా అన్పిస్తుంది. పెళ్ళి చేసుకోమని పోరుపెడ్తుంది తల్లి. కని తనకే ఇష్టంలేదు. లలితకి పెళ్లి చేయాలని ఎన్నాళ్ళగానో ప్రయత్నిస్తూవున్నాడు.కాని ఆ పెళ్ళి చేయలేకపోయాడు. కారణం, ఆకాశాన్నంటుతూవున్న కట్నాలు. స్వంతకాళ్లమీద నిలబడే ధైర్యంలేక ఈనాటి యువకుడు కట్నాన్ని నమ్ముకుని ఆత్మవంచన చేసుకుంటున్నాడు. ఈ పరిస్థితుల్లో పెళ్లి చేసుకుని మరొక బరువుని మెడకి తగిలించుకోవటాన్కి ఇష్టంలేదు తనకి—

అలాగ చెపుతూ చెపుతూనే గుర్రుకొట్టి నిద్రలోకి జారిపోయాడు సుబ్రమణ్యం.అదృష్టవంతుడు! నాకు నిద్రపట్టలేదు. బాగా ప్రొద్దుపోయింది. ఆకాశంలో చంద్రుడు. మనసు నిండా ఆలోచనలు. ఇప్పటి నా బందరు ప్రయాణానికి కారణం వుంది. బందరులో రమణయ్యనాయుడుగారని పెద్ద ప్లీడరుగా వున్నారు. ఆయన బాగా సంపాదించాడు. ఆయన మా నాన్నగారికి మంచి ఫ్రెండు. మా కుటుంబాల మధ్యన రాకపోకలు వున్నాయి. రమణయ్యనాయుడుకి ఒక కూతురు వుంది. ఆ అమ్మాయి పేరు సబిత.

ఎర్రటి శరీరచ్ఛాయ, మెరుపులాంటి అందం. మంచి మాటకారి. బి.ఏ. చదువుతూవుంది. కాని సబితలో కొంత అతిశయం, గర్వం వున్నాయనిపిస్తుంది. సబిత మంచిదే. కాని మాట పెళుసు. ఒక్కటే సంతానం కావటం వలన గారాబంగా పెరిగింది. వెనుక బోల్డంత ఆస్తివున్న సబితని కోడలుగా చేసుకోవాలని మా వాళ్ళు కొంతకాలంగా ఆలోచనలు చేస్తూ వుండటం నాకు తెలుసు. డబ్బా ఇంటివాడు మేడల దొరవైపు లేకిగా చూసినట్టు !

సబితమీద నాకు అయిష్టం లేదు. వాళ్ళ హంగూ, ఆస్తీ అంతస్తులమీద వ్యామోహం !

ఆమె ప్రవర్తన నాకు నచ్చలేదు. కాని ఆమె అంతస్తూ, అందమూ నన్ను ఆకర్షించాయి. అందువలన నేను రాజీపడ్డాను. ఏ విధంగా చూసినా వాళ్ళ అంతస్తు మా కంటె పెద్దది. అందుచేత పైచూపులోవున్న నేనూ ఇష్టపూర్వకంగానే మొగ్గుచూపాను.

## కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితం మీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి. ★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్‌మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరు గల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది — దారిలో పోయేనాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీ గాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది — పరిశీలనకి ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు—బాగా ముందుగా వాటి కవరు మీద ఆ ''ప్రత్యేక'' సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్ల కాగితం మీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

— సం॥

# ఇది ఆట కాదు

ఆ మధ్యన రఘునయ్యనాయుడుగారు మా ఇంటికి వచ్చినపుడు మా వాళ్ళు ఆ సంగతి కదిపారు. ఆయన కాదనలేదు. మా వాళ్ళ వేడికోలును ఆయన ఔదార్యంతో మన్నించారు.

'మన స్నేహం ఈ విధంగా బలపడటం నాకూ ఇష్టమే. కాని మనది ఏముంది ? పెళ్ళి చేసుకుని కాపురం చేయవలసింది వాళ్ళు. అందువలన అమ్మాయీ, అబ్బాయీ ఇష్టపడితే ఆ శుభకార్యం కానిచ్చి చేతులు దులుపుకుందాం. అందువలన — ఒకసారి అబ్బాయిని అక్కడికి పంపించండి. మాటల్లో నేనే విషయాన్ని కదుపుతాను. అమ్మాయి సరేనంటే మహాబాగు. పైగా వాళ్ళు పెళ్ళిచూపులూ చూసుకున్నట్లవుతుందిగదా.' అన్న ఆయన మాటను పట్టుకుని నన్ను పంపించారు మా వాళ్ళు—ఇప్పుడు.

నా మనసులో గుబులు గుబులుగా వుంది.

నా గురించి సబిత అభిప్రాయం ఏమిటి ? ఆ అమ్మాయి నన్ను పెళ్ళి చేసుకోవటానికి ఇష్టపడుతుందా ? గర్వం, మిడిసిపాటుతనం ఆవరించగా తెలిసీ తెలియని తనంతో క్రూరంగా నిరాకరిస్తుందా? ఎవరి మనసు ఏ సమయంలో ఎలాగ నడుస్తుందో స్పష్టంగా కనిపెట్టలేముగదా ! నేను పిహెచ్.డీ. చేస్తున్నాను. 'బ్రిలియంట్'గా పేరు తెచ్చుకున్నాను. గొప్ప శాస్త్రజ్ఞుడుగా అంతర్జాతీయ స్థాయిలో పేరు తెచ్చుకోవటం నా ధ్యేయం. వెనకాల నాకు కొద్దో గొప్పో ఆస్తిపాస్తులున్నాయి. అందగాణ్ణేనని నా అభిప్రాయం. సబితతో నాకు పరిచయం వుంది, గాని అది గాఢమయినదిగాదు.

నా ప్రయత్నం ఏమవుతుంది ? సబిత ఏమంటుంది ?

నా ఆశ ఫలిస్తుందా ? నిరాశే ఎదురయితే ఆ భంగపాటుకి నా గుండె, నా 'ఇగో' తట్టుకుని నిలబడగలదా ?

ఈ చీకాకుకు తోడు నా మనసు పొరల అంచుల్లో స్పష్టాస్పష్టంగా ఇంకా నిలిచి కలవర పెడుతున్న ఈ లలిత. లలిత ! అవునూ—ఎంతో పరిచయం వున్నా—ఎన్నాళ్ళకో నేను మరల ఆ ఇంటి గడప తొక్కినా—ముసలావిడగానీ, లలితగానీ, నా ఎదుటికి రాలేదు. పలకరించనే లేదు. ఎంత చిత్రం! ఈ సంగతి నేనూ ఆలోచించలేదు, ఒక్కసారికూడా!

నా వెనకాల ఏదో చప్పుడయింది !

గబుక్కున లేచి కూర్చున్నాను. గుడ్డివెన్నెలలో తెల్లతెల్లగా——

'ఎవరూ ?'

సమాధానం లేదు. దగ్గరకి వెళ్ళి చూసాను. ఆ వ్యక్తి లలిత !

'లలితా !'

'.........'

'బావున్నావా లలితా ? మీ అమ్మగారు బాగున్నారా ? మాట్లాడటం ఇష్టంలేదా ?'

'మా అమ్మకి జ్వరంగా వుంది. వేడినీళ్ళు కావాలి. పొయ్యి అంటించటానికి బొగ్గుల కోసమని వచ్చాను' అంది లలిత. ఆ సమాధానం నాకు రుచించలేదు. లలితని పరిశీలించసాగాను.

'ప్లీజ్ ! ఒక నిముషం ఆగరూ. మీతో పని వుంది. ఇప్పుడే వస్తాను' అని బొగ్గులు తీసుకుని వెళ్ళిపోయింది లలిత.

తనకి నాతో ఏమిటి పని ? ప్రేమించానంటుందా ? పెళ్ళి చేసుకోమంటుందా ? లేకపోతే ఏమిటా పని ? ఆ మాటే అడిగితే ఏం సమాధానం చెప్పాలి ? నీ మీద నాకూ ఇష్టం వుందిగానీ పెళ్ళి మాత్రం చేసుకోలేను, అనగలడా, తను ?! అని — ఆమెను చూస్తూ ఆమె ఎదుట నిలబడగలడా ? లలిత రియాక్షన్ ఎలాగవుంటుంది ? కన్నీరు మున్నీరయితే తను సహించగలడా ? ఎంత అసహ్యమయిన పరిస్థితీ ! ఛీ.

పది నిముషాలలో వచ్చింది, లలిత. మనసుని రాక్షసంగా మార్చుకుని నేను తయారయేవున్నాను. ఆ సంగతి ఆ పిల్లకేం తెల్సు ? పాపం! అమాయకురాలు.

'ఇది మీ వస్తువు. ఇన్నాళ్ళూ అనవసరంగా నా దగ్గర వుండింది. పట్టుకెళ్ళండి' అంటూ ఆ వస్తువుని నా చేతిలో పెట్టి గిర్రున వెనుదిరిగి వెళ్ళిపోయింది లలిత.

అది—లలితకి ఎప్పుడో నేను ప్రజంట్ చేసిన పార్కర్ పెన్ను !

నా అహానికి దెబ్బ తగిలింది.

నా గుండెలమీద బలంగా గుద్దినంత బాధ. ఆ బాధని భరించలేక కసిగా పెదాలు కొరుక్కున్నాను. అప్పుడే గనుక లలిత ఇంకా నా ఎదురుగా నిలబడి వుంటే నేను ఏమిచేసేవాడినో నాకు తెలియదు. అహం దెబ్బతిన్నప్పుడు వివక్షణకి తావెక్కడ ? ఆ పరిస్థితిలో ఏమిచేసి నా కసిని తీర్చుకున్నా, ఆ పేదరాలు, అమాయకురాలు, అసహాయురాలు ఏమి చేయగలదు? కాని లలిత క్షణం ఆగకుండా పారిపోయింది.

నా వంటిమీద కారం చల్లినట్లనిపించింది. ఇంక నేను క్షణంకూడా అక్కడ వుండలేను వెంటనే సుబ్రమణ్యాన్ని తట్టి నిద్రలేపాను.

'టయిమునకి టయిమయింది. పోదాం పద' అన్నాను.

నా సూట్‌కేసు తెచ్చి, నన్ను అనుసరించాడు సుబ్రమణ్యం. స్టేషనులో గంటన్నరసేపు పడిగాపులు పడి నన్ను రైలు ఎక్కించి వెళ్ళిపోయాడు సుబ్రమణ్యం. ఆ వూరు వెనుకనడిపోయింది. ఆ మనుషుల్ని మదిలోనుంచి దూరం చేసుకుంటానికి ప్రయత్నించాను. ఇపుడు నా మనసు అందమయిన భవిష్యత్తుకోసం పరుగులు పెడుతోంది. రైలుకంటే ఎక్కువయిన వేగంతో ప్రయాణిస్తోంది. అస్థిరత నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తూంది!

సబిత —

అందం, అభిజాత్యం, అతిశయం నిండిన సబిత! లక్షాధికారి ఏకైక కుమార్తె.

సబిత నా భార్య అవుతుందా? నా కోరిక సఫలీకృతమవుతుందా?

నా మనసంతా ఇవే ఆలోచనలు.

ఇది కేవలం ప్రేమకథ గాదు. ప్రేమగా చలామణీ అవుతున్న ఆకర్షణా, దానికి మూలమయిన అందము, అయిశ్వర్యము, అంతస్తులూ, కర్కశమయిన, కఠినమయిన, క్రూరమయిన వాటి తీరుతెన్నులూ, మనసుల్ని దారుణంగా అణగద్రొక్కి

వికటంగా నాట్యమాడే వాటి విన్యాసాలూ ఇక్కడ ముఖ్యంగా పరిగణనలోకి తీసుకోబడినాయి.

అందువలన, ఇక్కడ, సబిత— ఆమె నిర్ణయం ప్రముఖమయిన స్థానం ఆక్రమించింది.

అందుకే— ఈ ఆందోళితమయిన మనఃస్థితి! వూగిసలాట.

ఒకసారి మెడలో తాళి కట్టించుకుంటే — సబితయొక్క గర్వం, దర్పం, అతిశయం అనే ఆ అంశాల్ని ఎలాగ అణగద్రొక్కి, నా సుపీరియారిటీని ఎస్టాబ్లిష్ చేసుకోవాల్నో— అన్నీ వివరంగా ప్లాన్సు వేసుకుని వున్నాను. ఒక విషయాన్ని విశ్లేషించి, పద్ధతి ప్రకారం నాకు సానుకూలంగా ఎలాగ మలచుకోవాలో నాకు తెలుసు. నా తెలివితేటల్ని గురించి మా నాన్నగారు ఇచ్చిన సర్టిఫికేట్ అకారణమూ, అనాలోచితమూ కానేకాదు. ఆ విశ్వాసం నాకుంది. గమ్యం చేరాక — రమణయ్యనాయుడుగారింట్లో నాకు అపూర్వమయిన స్వాగతం లభించింది.

కాని, సమయానికి ఆయన ఇంట్లో లేరు ! అవసరమయిన పనిమీద మద్రాసు వెళ్ళారనీ, నాల్గు రోజుల దాకా రారనీ తెలిసింది. పిటీ!

స్నానం చేసి బట్టలు మార్చుకుని, కాఫీ తాగి రిఫ్రెష్ అయ్యాక సబిత నాకు దర్శనం ఇచ్చింది. మయూరిలా, రాజహంసలా నడిచి వచ్చి నన్ను సమీపించి —

'గుడ్ మార్నింగ్' అని సమ్మోహనకరంగా నవ్వింది.

'వెరీ గుడ్‌మార్నింగ్!' అన్నాను గుండెల్లో ఆనందం గంతులువేస్తుండగా.

వయ్యారంగా సబిత నా ఎదురుగా సోఫాలో కూర్చుంది. నౌకరు లోపల్నుంచి ట్రేలో వేడివేడి టిఫెన్ తెచ్చాడు. ప్లేటులో సర్ది నాకందించింది సబిత.

'థాంక్సు.'

'నో మెన్షన్' నవ్వింది సబిత. తెల్లని పలువరుసల మెరుపులు నన్ను సమ్మోహితుడిని చేసాయి. ఆ పలువరుసలను కప్పుతూన్న ఎర్రని తడి పెదాలు ! పూర్ణమై, అనురాగభరితమై, ఆకర్షకమై మనసునిపట్టి లాగుతూ—ఎర్రని వంటిని కప్పుతూ వెలాతెలా పోతూవున్న ఎర్ర చీరా, ఎర్ర జాకెట్టూ — ఎగసిపడుతూన్న యవ్వనం. కాని ఆ కదలికలలో అతిశయం, దర్పం! అదే నాకు నచ్చదు. పళ్ళు కొరుక్కున్నాను—కసిగా.

ఏవేవో విషయాలు చెప్పింది సబిత ! వినటం నావంతు. గర్వం ఆమె మాటలలోనుంచి పొంగి పొరలుతూ వుంది. నా గుండె నిండా కసి పేరుకుని పోతూవుంది!

'సారీ! మీరు వచ్చేప్పటికి నాన్నగారు లేరు! అమ్మ ఏవో మీటింగులని ఢిల్లీ వెళ్లింది. సారీ ఫర్ది ఇన్‌కన్వీనియన్స్'అంది సబిత నన్ను పరిశీలనగా చూస్తూ.

'ఫరవాలేదు. నేను వచ్చింది వాళ్ళకోసం కాదు. మీకోసం' అన్నాను మిశ్చీవస్‌గా నవ్వి. ఆ నవ్వు ఆమెను పడవేస్తుందని నా అంచనా.

'వాట్ డూ యూ మీన్ !' అని ఆశ్చర్యపోయింది సబిత. అటో ఇటో తేల్చేయాలి. ముసుగులో గుద్దులాటలొద్దు. 'అవును సబితా ! మన మాచ్ గురించి పెద్దవాళ్ళ మధ్య మాటలు నడిచాయి. మనం ఓ.కే. అనటమే మిగిలింది. ఐ లవ్ యూ సబితా' ఆవేశంగా అన్నాను. నేను తొందరపడ్డానా ? ఆ తొందరపాటులో ఫూల్‌లాగ ప్రవర్తించానా ? ఆ వెంటనే — భయంకరమయిన సిగ్గులో మునిగిపోయాను. నేను తలవంచుకుని ఆమె సమాధానం కోసం ఎదురుచూసాను ఎంతో ఆత్రుతతో. కొన్ని క్షణాలు దొర్లాయి.

సబిత తత్తరపాటుని అణచుకుని మెల్లగా అంది చివరికి—

"అవున్నిజమే. ఈ విషయం ఆ మధ్యన నాన్నగారు చెప్పారు. కాని, నా పెళ్ళి గురించి నా అభిప్రాయాలు వేరేవున్నాయి. నేను ఒక డాక్టర్ని ప్రేమించాను. ఆయన ఇపుడు అమెరికాలో వున్నారు. ఐ లవ్‌డ్ హిమ్. అయ్ లవ్ అమెరికా. సారీ బాస్, అయాం సారీ." ఆ మాటలు దృఢంగా, కఠినంగా వినవచ్చాయి. నా మొహం ఎర్రగా అయింది. నా నరాలు బిగదీసుకునిపోయాయి. నా నోరు పెగిలి రాలేదు. ఒక పిరికితనం నన్నావహించింది. ఇన్‌ఫీరియారిటీ నన్ను లోబరచుకుంది. ఐ వజ్ కట్ టూ సైజ్! భయం, దిగులూ నన్ను లోబరచుకున్నాయి. నా అతిశయం, దర్పం, అహంకారం, దారుణంగా, నిలువునా కరిగి నీరయిపోయాయి. నేను చిన్నగా, అతిచిన్నగ అయిపోయాను. నా ప్లాన్స్ అన్నీ భయంకరంగా ముక్కలు ముక్కలుగా అయిపోయాయి. నౌ అయామె పూర్ సోల్ ! నేనేమయిపోతున్నాను ?! ఆమె ఎదుట—ఆ భయంకర రాక్షసి సబిత ముందు నేను ఇక క్షణమాత్ర కాలం కూడా కూర్చోలేను...లేను. అయిపోయింది. పేకమేడలు కూలిపోయాయి.

'సారీ, ఫ్రెండ్. నేను వెంటనే ఒక ఫంక్షన్‌కి అటెండవాలి. మా ఫ్రెండ్ బర్త్ డే పార్టీ ! వుంటారుగా. వస్తాను' — అని లేచి వయ్యారంగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది—సబిత. సబితా ది డెవిల్ ! ఓపెన్ చేసిన గేటునుంచి, సబిత ఎక్కిన లైట్ బ్లూ ఫియట్ దూసుకునిపోయింది ! ఎంత గర్వం !? ఈమెనా నేను పెళ్ళాడదల్చుకున్నది ?

సబిత అందము, అయిశ్వర్యము, అంతస్తూ-నాతో క్రూరంగా ఆడుకున్నాయి. పూర్తిగా ఓడిపోయాను. నేను మాత్రం ? వాటి వలలోనేపడి పరుగులెత్తి నేనూ లలితతో మరింత భయంకరంగా ఆటలాడలేదా ? కానీ, దానికి నేను గుర్తింపు ఇవ్వలేకపోయాను. స్వార్థం అనబడే ఆజ్యం మీదపడగా ఎగసిపడే అరిషడ్వర్గాలమంటలే అందుకు కారణమని నాకు తెలుసు. ఆ మంటలు మనిషిని దహించివేస్తాయి. అందులోంచి మనిషికి లభ్యమయ్యేది దుఃఖం, భయం, బాధ. వాటిలోంచి పుట్టుకుని వచ్చినవే, పిరికితనం, అలసత్వం. అందుకే అన్నాను. ఇది ప్రేమ కథగాదు. ప్రేమగా చలామణీ అవుతున్న ఆకర్షణా — దానికి మూలమయిన అందమూ, అయిశ్వర్యమూ, అంతస్తూ—కర్కశమయిన, కఠినమయిన, క్రూరమయిన వాటి పద్ధతులలో పడి నలిగి, గాయపడి, నెత్తురుకార్చే గుండెల మూల్గులూ—నా కథకి ప్రధానమయిన వస్తువులు విషాదం నిండివున్న ఈ తరపు కథ ఇది !

కాగా, మానవమాత్రుడ్నే గనుక, నా వైఫల్యం నన్ను కన్నీటిలో ముంచెత్తకా, ఆ ప్రళయ సదృశమయిన ప్రవాహంలోపడి నేను కొట్టుకునిపోకా తప్పదు...తప్పదు.

దీనంగా — తలవంచుకుని, నా సూట్‌కేసుని తీసుకుని, ఆ ఇంటినుంచి బయటపడదామని అడుగులు వేసాను. అంతవరకూ నేను కూర్చునివున్న ఆ సోఫాలో, నా జేబునించి ఎలాగో జారిపడిన, ఆ పార్కర్ పెన్ను, మెరుస్తూ స్నిగ్ధంగా, అమాయకంగా పలకరించింది! దాన్ని అక్కడ్నే వదిలి రోడ్డుమీద పడ్డాను! తిరోగామినై ప్రయాణానికి సిద్ధమయ్యాను. ★





# పుష్కలమైన పంట-లక్ష్మి మీ ఇంట
# ...ఆ పంటను పెంచి పోషించేది జై కిసాన్

జైకిసాన్ మీ పంటలను పెంచి పోషిస్తుంది, మీ కలల్ని నిజమని నిరూపిస్తుంది. అధునాతనమైన సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా గల జైకిసాన్ శక్తివంతమైన ఎరువులు భూమిలో వెంటనే కరిగి మీ పంటలకు అపారమైన శక్తినీ, తక్షణమైన పెరుగుదలనూ చేకూరుస్తాయి. మీ పైర్లతోపాటే మీ భాగ్యంకూడా వికసిస్తుంది ...మీకు హెచ్చు దిగుబడినీ, దాంతోపాటు హెచ్చు సంపదనూ ఇస్తుంది జైకిసాన్. గుర్తుంచుకోండి, ప్రతి పంటకు, ప్రతి భూమికి అవసరానికి తగిన పాళ్లలో వేయడానికి జైకిసాన్ ఎరువు ఉంది. జైకిసాన్ ఎరువుల విస్తృతమైన శ్రేణిలోంచి మీరు మీకు కావలసినదాన్ని ఎంచుకోవచ్చు.

**జై కిసాన్ యూరియా 46.4% నత్రజని** అతి తెల్లటిది, అతి స్వచ్ఛమైనది, అతి శక్తివంతమైనది. దీనిలో బైయూరేట్ పాలు అతి తక్కువ (0.5% కంటే తక్కువ). అంచేత ఆకుల మీద పిచికారి చేయడానికి సురక్షితమైనది. అన్ని పంటలకూ భూమిమీద పై చల్లుగా అనువైన ఎరువు.

**జై కిసాన్ యూరంఫాస్ 28:28:0** అత్యధికంగా నత్రజని, ఫాస్ఫేటూ సమానమైన పాళ్లలో గల శక్తివంతమైన ఎరువు. దాదాపు పూర్తిగా నీటిలో కరుగుతుంది. దీనిలోని రెండు పోషక పదార్థాలూ కూడా ఒకే సమయంలో భూమిలో కరిగి పెరుగుతున్న పంటకు అందుబాటులో ఉంటాయి.

**జై కిసాన్ సంపూర్ణ 19:19:19** అతి చిక్కనైన కాంప్లెక్స్ ఎరువు. దీనిలో నత్రజని, ఫాస్ఫేటు, పొటాష్‌లు సమానమైన పాళ్లలో ఉన్నాయి. దాదాపు పూర్తిగా నీటిలో కరిగే ఈ ఎరువులో 57% పోషక పదార్థాలున్నాయి. అవన్నీ ఒకే సమయంలో భూమిలో కరిగి పంట వాటిని సులభంగా గ్రహించడానికి వీలు పడుతుంది. పొటాష్ లోపం గల భూములకు జైకిసాన్ సంపూర్ణ ప్రత్యేకించి లాభదాయకమైనది.

**జైకిసాన్ యూరంఫాస్, సంపూర్ణ ముఖ్యంగా అధిక దిగుబడి రకపు వరి, చెరకు, కాయగూరలు, పత్తి, జొన్న, గోధుమ మొదలైన పంటలకు బాగా అనువైనవి. అంతేకాదు, కాఫీ, తేయాకు లాంటి తోట పంటలకూ, మామిడి, కమలా, నారింజ, అరటి మొదలైన పండ్ల తోటలకూ కూడా ఎంతో అనువైనవి.**

**జై కిసాన్ సౌభాగ్య 14:35:14** నత్రజని, పొటాష్‌లు దీనిలో సమానమైన (ఒక్కొక్కటి 14%) పాళ్లలో ఉన్నాయి. పైగా 35% ఫాస్ఫేటు కూడా ఉంది—అంటే మొత్తం 63% పోషక పదార్థాలు ఉన్నాయన్నమాట. ఫాస్ఫేటు హెచ్చుగా ఉండటం వల్ల జైకిసాన్ సౌభాగ్య ముఖ్యంగా వేరుశనగ, ఇతర నూనె గింజల పంటలకూ, పప్పు దినుసుల పంటలకూ బాగా అనువైనది. దుంపజాతి పంటలైన బంగాళాదుంప (ఆలుగడ్డ), పసుపు, కందమూలం, ఉల్లి మొదలైనవాటికి కూడా ఎంతో మంచిది. చెరకు, పత్తి పంటలకూ, ఏలకులు మొదలైన తోట పంటలకూ కూడా ఉపయోగకరమైనది.

**జై కిసాన్ డయంఫాస్ 18:46:0** డయంఫాస్ 18:46:0 లో 18% నత్రజని, 46% ఫాస్ఫేటు ఉన్నాయి. అత్యధికంగా పాళ్లు కలిగిన కాంప్లెక్స్ ఎరువు అయినందువల్ల తక్కువ పరిమాణంలో వేస్తే చాలు. అంచేత ఖర్చుకూడా చాలా తక్కువ. ఈ ఎరువు ప్రత్యేకించి, హెచ్చుగా ఫాస్ఫేట్ కావలసిన పంటలకు అంటే వేరుశనగ, పప్పు దినుసులు, నూనె గింజలు మొదలైన వాటికీ, పసుపులాంటి దుంపజాతి పంటలకూ అనువైనది. చెరకు, పత్తి పంటలకు కూడా మంచిది.

## జై కిసాన్ ఎరువులు-అత్యంత శక్తికీ, సత్వర పెరుగుదలకూ




జువారి ఆగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.
ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: కర్నూలు, సికింద్రాబాద్, బెంగుళూరు, హుబ్లి, కొంకణ్, నాగపూర్, పూనా.
మీ జైకిసాన్ ఎరువుల్ని జువారి వారి పసుపు పచ్చ దుకాణాల్లో కొనుక్కోండి.









ఆరోగ్యంచిందే పళ్ళు, చిగుళ్ళకోసం నమ్మకంగా వాడబడేది లవంగనూనె

కొత్త

ఇదిగో

# ప్రామిస్ పళ్ళ పొడి

## అనాదిగా వాడబడుతున్న లవంగనూనెతో కూర్చినది

లవంగనూనెతో కూడిన ప్రామిస్ పళ్ళపొడి మీకెలా తోడ్పడ [illegible]ందో చూడండి.

- నోటిలో దుర్వాసనను, దంతక్షయాన్ని కలిగించే క్రిములను తొలగిస్తుంది. మీ నోటిని శుభ్రంగా రూపొందిస్తుంది.
- మీ చిగుళ్ళు ఆరోగ్యం చిందించేలా చేసి అతి మెల్లగా రుద్దుతుంది.
- మీ పళ్ళను తెల్లగా తళతళలాడేలా చేస్తుంది.
- పిప్పరమెంట్ మరియు లవంగనూనె యొక్క సాటిలేని రుచి.




బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి
అధునాతన సాధనాలు

## కొత్తది. సాటిలేనిది. లవంగనూనె గలది ప్రామిస్ పళ్ళపొడి

CHAITRA-BLS-436 TEL

# హైదరాబాదు నోట్‌బుక్

**వీరనారి దుర్గాబాయి :**

శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయి మే 9వ తేది ఉదయం శాశ్వతంగా కన్నుమూశారంటే నమ్మలేకపోతున్నాను. ఆమె పిడికిలి బిగించి ఎత్తి వీరగంధము తెచ్చినాము వీరులెవ్వరో తెలుపుడీ! అని ఉప్పు సత్యాగ్రహ సమరంలో ఎలుగెత్తి పాడిన పాట ఇంకా నా చెవులలో గింగురుమంటూంది. తిరుచిరాపల్లి జెయిలులో ఆమె మహిళా విభాగం నుంచి ఆంధ్రా దేశపు మట్టి— అది మాకు కనకము, ఆంధ్రదేశపు నీరు—అది మాకు అమృతము అంటూ పాడుతూ ఉంటే ఆ ధ్వని తరంగాలకు జెయిలు గోడలు అదిరిపోయేవి. ఆమె 1932లో తిరుచిరాపల్లి జెయిలు నుండి విడుదల కాగానే పురవీధులలో ఆమెను ఊరేగించడానికి ప్రజలు చూపిన ఉత్సాహావేశాలు అధికారులను దిగ్భ్రాంతులను చేసింది. జెయిలులో ఆమె పోరాటకారితనానికి, ధైర్యానికి అందరూ విస్తుపోయేవారు. దుర్గాబాయి 1909 జులై 16వ రాజమండ్రిలో జన్మించింది. తండ్రి బి. వి. ఎన్. రామారావు సంఘ సంస్కరణ భావాలు, దేశభక్తి భావాలు ఆమె లేత మనసులో నాటుకోగానే 12వ ఏట గాంధిజీ బోధలకు ప్రభావితురాలయి హిందీ నేర్చుకొని, కాకినాడలో బాలికల కోసం ఒక పాఠశాల పెట్టి నూలు వడకడం ఖద్దరు నేత, సంగీతం, నేర్పేది. గాంధిజీ 1921లో ఆంధ్ర ప్రాంత పర్యటనకు వచ్చినప్పుడు ఆయన వెంట ఉండి ఆయన హిందీ ప్రసంగాలను తెలుగు చేసి గొప్ప మెప్పు పొందింది. ఉప్పు సత్యాగ్రహంలోను, వ్యక్తిగతసత్యాగ్రహంలోను తర్వాతను పెక్కుసార్లు ఆమె కారాగారశిక్ష అనుభవించింది. ఉన్నత విద్య లేనిదే ఏమీ చేయలేమనే ఉద్దేశ్యంతో ప్రైవేట్‌గా మెట్రిక్కు పరీక్షలో ఉత్తీర్ణురాలై 1939లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి. ఏ. ఆనర్సు చదివి 1942లో న్యాయశాస్త్ర పట్టభద్రురాలై ఫెడరల్ కోర్టు న్యాయవాదినిగా నమోదయింది. 1946లో భారతరాజ్యాంగ సభ సభ్యురాలై దాని సారథ్య సంఘానికి ఎన్నికైన ఏకైకమహిళ. విద్యార్థి దశలోనే 1939లో మద్రాసులో ఆంధ్ర మహిళా సభ స్థాపించి, సేవ చేసింది. దానికి అనుబంధంగా నర్సింగ్ హోం, ఆర్థోపెడిక్ సెంటర్, మహిళా వసతి గృహాలు స్థాపించింది. ఆంధ్ర మహిళా శాఖ హైదరాబాదులో 1958లో నెలకొన్నది. దానికి అనుబంధంగా వికలాంగుల కేంద్రం, ఉచిత వైద్యశాల, సాంకేతిక కళాశాల, కాలేజీ ఆఫ్ ఎడ్యుకేషన్, మహబూబ్‌నగర్‌లోను, సంగారెడ్డిలోను శాఖలు ఏర్పడ్డాయి. ఆమె 1950లో శ్రీమతి విజయలక్ష్మి పండిట్ నాయకత్వాన చైనాకు వెళ్ళిన తొలి భారత ప్రతినిధివర్గంలో సభ్యురాలు. 1950 నుంచి నాలుగేళ్లపాటు ప్రణాళికా సంఘం సభ్యురాలు. ఆమె సలహా మీదే కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు నెలకొన్నది 1953లో. దానికామె 1962 వరకు అధ్యక్షురాలుగా ఉంది. జాతీయ మహిళా విద్యామండలికి ఆమె తొలి అధ్యక్షురాలు. 1963లో వాషింగ్టన్‌లో జరిగిన ప్రపంచాహార కాంగ్రెసుకు భారత ప్రతినిధిగా వెళ్లింది. ఆమె 1952లో డాక్టర్ సి. డి. దేశముఖ్‌ను వివాహమాడింది. 1974లో ఆమె నెహ్రూ లిటరసీ అవార్డుతోను, 1975 లో భర్తతోపాటు పద్మవిభూషన్ బిరుదంతోను, 1978లో పాల్ జి. హాఫ్‌మన్ బిరుదంతోను సన్మానితురాలయింది. 1963లో ఆమెను ఆంధ్ర విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ బిరుదంతో అలంకరించింది. ఆమె మరణానికి ఆంధ్రప్రదేశ్ విలపించింది. ఆమె భౌతికకాయానికి దహన సంస్కారం అంబర్‌పేటలోని విద్యుద్దహనవాటికలో జరిగింది. స్వయంకృషితో, త్యాగదీక్షలతో, సేవాపరాయణతతో పైకివచ్చి, ప్రజా సేవకే జీవితాన్ని మీదుకట్టిన శ్రీమతి దుర్గాబాయిదేశ్‌ యువతీ యువకులకు ఎల్లకాలమూ ఆదర్శంగా ఉంటుంది.

**సాహిత్య అకాడెమీ బహుమతులు :**

1979 -80 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ప్రకటించిన తెలుగు సామెతలు - సాంఘిక జీవితం, బాలసాహిత్యం అనే రెండు విషయాలపై డాక్టర్ పి. నరసింహారెడ్డి, శ్రీ వెలగా వెంకటప్పయ్యగార్ల లిఖిత ప్రతులకు బహుమతులు వచ్చాయి. డాక్టర్ నరసింహారెడ్డి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు ఉపన్యాసకులు, శ్రీ వెంకటప్పయ్య ఒంగోలు జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శి.

# హైదరాబాద్ నోట్‌బుక్

**తెలుగు తల్లి రూపం :**

తెలుగుతల్లి స్వరూపం ఎలా ఉండాలనే చర్చ చాలా కాలంగా జరుగుతున్నది. దేశమాత దేవతగనుక నాలుగుచేతులు ఉండాలని కొందరు, వ్యావహారరూపవేగనుక రెండుచేతులే ఉండాలని కొందరు నిర్ణయించి చిత్రాలు శిల్పాలు తయారు చేశారు. వాదోపవాదాల తీవ్రం కావడం వల్ల ప్రభుత్వం జోక్యం అవసరమయింది. అందువల్ల రాష్ట్ర ప్రభుత్వం పండితులతో ఒక నూతనసంఘం నియమించాలనిసాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి తెలియజేశారు. శ్రీయుతులు డాక్టర్ ఖండవల్లి లక్ష్మీరంజనం, తుమ్మలపల్లి సీతారామమూర్తి చౌదరి, డాక్టర్ దాశరధి, మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, రాయప్రోలు సుబ్రమణ్యం, డాక్టర్ బి. రామరాజు, ఉప్పులూరి గణపతిశాస్త్రి ఈ సంఘం సభ్యులు రాష్ట్ర సాంస్కృతికశాఖ డైరెక్టర్ డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు ఈ సంఘం కన్వీనర్‌గా వ్యవహరిస్తారు. సభ్యులందరూ ఆయా రంగాలలో గొప్పవారుగనుక తెలుగుతల్లి స్వరూప నిర్ణయంలో వివాదాలు సమసిపోగలవని ఆశించవచ్చు.

**అస్సాంలో 35 లక్షలమంది విదేశీయులు !**

అస్సాం విద్యార్థినాయకులు శ్రీ భృగుకుమార్ పూకన్, లలిత్‌రాజుకోలా మార్చి 27వ పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ అస్సాంలో 1951లో ఎనిమిది లక్షలున్న విదేశీయుల సంఖ్య నేడు 35 లక్షలకు పెరిగిందని, విదేశీయులు ఏభాషవారయినా ఏమతం వారయినా విదేశీయులేనని అన్నారు. బంగ్లాదేశ్, నేపాల్‌ల నుంచి ప్రజలు అక్రమంగా అస్సాంలో ప్రవేశించడం వల్ల అస్సాం ఆర్థిక సాంఘిక పరిస్థితి అస్తవ్యస్థమయిందని, భారత్ దేశంలోని ఇతర ప్రాంతాల నుంచి అస్సాంలో ప్రవేశించిన వారికి, వ్యతిరేకంగా తాము ఉద్యమం జరుపడం లేదని అక్రమంగా అస్సాంలో ప్రవేశించిన వారికి ప్రతికూలంగామాత్రమే ఉద్యమమని వారన్నారు. అస్సాంలో ఆందోళన ప్రారంభమై దాదాపు రెండు, సంవత్సరాలు కావచ్చిందని, మేనెల తర్వాత మరింతతీవ్రం కాగలదని అన్నారు. ఉద్యమం నీరుకారిపోయిందని కొందరు ప్రచారం చేయడంలో వాస్తవం లేదని వారన్నారు.

**ఉపశ్రుతి :**

కవిగారూ, రవిగాంచని చోటు కవిగాంచును గదా! మీరు కౌలాలంపూర్‌లో చీకటి తప్పు ప్రాంతాలను కూడా చూచారా? అని ప్రశ్నించాను అక్కడ కవి సమ్మేళనంలో పాల్గొన్న ఒక సుమారయిన కవిని. "చూద్దామనే వెళ్లాను. మా నాయకుడైన మహా కవే ఎదురుపడ్డాడు. ఆయన చూచింది చెబుతాడుగా, మనమెందుకు అని తిరిగి వచ్చాను" అన్నారు ఆ సుమారయిన కవి.

— తిరుమల రామచంద్ర

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.




**దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే**
**ఋజువు చేసుకోండి :**

[మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది]



[సూపర్ రిన్‌తో ఉతికినది]

సూపర్
రిన్‌లో తెలుపు చేసే శక్తి
ఎక్కువ

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన.

లింటాస్-RIN. 40-2316 TL

ఉదయం పదిగంటలయింది భర్త రవి ఆఫీసుకెళ్ళాడు. తీరికగా వారపత్రిక చదువుతూ వరండాలో సోఫాలో కూర్చుంది వినూత్న.

పక్క పోర్షన్‌లో ఉంటున్న సుజాతకూడా పని ముగించుకుని వచ్చి, వినూత్న దగ్గర కూర్చుంది.

"మన ఎదురింట్లో ఉంటున్న చిట్టెమ్మ గారు గుంటూరు నుంచి వస్తూ, జరీచీరెలు తెచ్చారంట. మనిద్దరం చేరో చీర తీసుకుందామా?" అడిగింది సుజాత.

"ఏమిటీ? చిట్టెమ్మగారు చీరలవ్యాపారం కూడా చేస్తారా?" అడిగింది వినూత్న ఆశ్చర్యంగా. "చిట్టెమ్మగారి బంధువులు గుంటూరులో ఉన్నారు ఆమె అక్కడకువెళ్ళి నప్పుడల్లా, అక్కడ చవగ్గా వస్తాయని జరీ చీరెలు కొనుక్కొస్తుంది. మనలాంటి వాళ్ళం అడిగితే కాదనలేక తెచ్చిన ఖరీదుకే ఇస్తుంది. చాలా మంచావిడ. ఎప్పుడు కనిపించినా, నవ్వుతూ ఆప్యాయంగా మాట్లాడుతుంది."

"నెలాఖరు కదా? ఇప్పుడు డబ్బెక్కడుంది?"

"నా దగ్గర మాత్రం ఉందా ఇప్పుడు? జీతాలు రాగానే ఇచ్చేద్దాం మనం ఆలస్యం చేస్తే ఉన్న చీరలన్నీ ఎవరో ఒకరు తీసుకుంటారు. ఎవరడిగినా కాదనలేరు ఆమె. జీతాలు వచ్చింతర్వాత డబ్బిస్తాం అంటే చీరెలు ఇస్తుంది."

"అప్పుచేసి చీరలు కొనుక్కోవటం ఎందుకులే సుజాతా? తర్వాత తీసుకుందాం." నసుగుతూ అంది వినూత్న.

"చిట్టెమ్మగారి సంగతి నీకు తెలియదు కాబట్టి ఆమె దగ్గర చీరలు తీసుకోవటానికి సిగ్గుపడుతున్నావు. ఈ వీధిలో ఎవరికి డబ్బు అవసరం వచ్చినా ఆమే సర్దుతుంది. మనం చీరలు జీతాలు వచ్చింతర్వాత తీసుకుందాంలే అనుకుంటె, ఈలోగా చీరలన్నీ అయిపోతాయి." నచ్చజెపుతున్న ధోరణిలో అంది సుజాత.

సుజాత మాటలు, వినూత్న మీద పని చేసాయి. సహజంగా అప్పుచేసి వస్తువులు కొనటంగానీ, చీరలు కొనటంగానీ వినూత్నకు అలవాటు లేదు. సుజాత బలవంతం మీద ఆమెతో కలిసి, చిట్టెమ్మగారింటికి వెళ్ళి, జీతాలు రాగానే డబ్బిస్తాం అని చెప్పి,




సుజాతతో బాటు, వినూత్న కూడా రెండు చీరలు తెచ్చుకుంది.

అలా వినూత్నకు, సుజాతకూ చిట్టెమ్మగారితో మొదలయిన పరిచయం, రెండునెలలు గడిచేసరికి మంచి స్నేహంగా మారింది అప్పుడప్పుడు చిట్టెమ్మగారు కూడా వీళ్ళింటికి రావటం మొదలు పెట్టింది. ఆమె గుంటూరు నుంచి చీరలు తీసుకొచ్చినప్పుడల్లా, అవసరం ఉన్నా లేకపోయినా ఆమెదగ్గర అప్పు పెట్టి చీరలు తెచ్చుకోవటం, ఆ తర్వాత డబ్బు చేతి కందినప్పుడు ఆమె కివ్వటం జరుగుతోంది. వీళ్ళిద్దరికీ కష్టసుఖాలు చెప్పుకునేందుకు చిట్టెమ్మగారు పెద్దదిక్కు అయింది.

సాయంత్రం నాలుగుగంటల సమయములో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారువినూత్న, సుజాత. అంతలో అక్కడకు చిట్టెమ్మగారు కూడా వచ్చింది.

అయిదు నిముషాలలో, ఆమెకోసం వినూత్న జీడిపప్పు ఉప్మా తయారుచేసే సరికి, సుజాత టీ తయారుచేసి, పొగలు కక్కుతున్న మూడు కప్పుల టీ తీసుకొచ్చింది. టిఫిన్, టీ కార్యక్రమం పూర్తి అయింతర్వాత చిట్టెమ్మగారు తను వచ్చిన విషయం చెప్పింది.

"మీరిద్దరూ కూడా, చీటీపాటకు డబ్బు కడతారా ?" అని అడిగింది చిట్టెమ్మగారు.

"అస్సలు చీటీపాట అంటే ఏమిటో కూడా నాకు తెలియదు." అంది వినూత్న.

"నాకూ తెలియదు." అంది సుజాత.

"ఏం లేదమ్మా. అదేం బ్రహ్మవిద్యకాదు. ఈరోజుల్లో చీటీపాటను గురించి, మీకు తెలియదంటె నాకాశ్చర్యంగా ఉంది. పదిమంది కలిపి, పది వందల రూపాయలు, అంటే మనిషికి ఒక వంద రూపాయలు చొప్పున పెద్దమనిషి అనుకున్నామె చేతిలో పెడతారు. ఆ పదిమందిలో, డబ్బు అవసరం అయిన వాళ్ళు, పది రూపాయల నుంచి, ఒక్కసారి రెండు మూడు వందల రూపాయలు దాకా పాటపాడతారు. పాడేవాళ్ళు ఎక్కువ మంది ఉంటే వాళ్ళ, వాళ్ళ అవసరాలను బట్టి పాట పెరుగుతుంది. పాట వందరూపాయలకు ఆగిపోయిందనుకో, అప్పుడు పాటపాడుకున్న ఆమెకు వందరూపాయలు తగ్గించి, అందరి డబ్బూ కలిపి తొమ్మిదివందలు ఆమెకిస్తారు. మిగతా వందరూపాయల్ని, తమ పెట్టుబడి వందరూపాయలకు, లాభంగా పదిమంది సమానంగా పది పదులు పంచుకుంటారు. అంటె మీకు నెలకు వందరూపాయలకు పది రూపాయలు లాభం వస్తుంది. వరసగా పదినెలలూ అలా లాభం వస్తూనే ఉంటుంది. పాడుకోకుండా ఉంటే పదినెలలు గడిచింతర్వాత మీరు పది నెలల నుంచి కట్టిన డబ్బు మొత్తం వెయ్యి రూపాయలు ఒకేసారి చేతికొస్తుంది. మీరిద్దరూ కూడా చెరో వంద రూపాయలు కట్టండమ్మా."

ఆమె మాటలు వింటుంటే, సుజాతకు ఆశ పెరిగింది. ప్రతినెలా వందరూపాయలు కూడబెట్టుకుంటే, ఆవందకు పదిరూపాయలు లాభం వస్తుంది. పది నెలలు గడిచేసరికి వందరూపాయలు చేతికందుతాయి అనుకుంది. సుజాత సరేనంది. వినూత్న మాత్రం "మా వారికి తెలియకుండా నేనేపని చెయ్యను. ఆయనకు చెప్పి ఆయన ఒప్పుకుంటే తప్పకుండా కడతాను' అంది.

"అయ్యో పిచ్చితల్లి ! నువ్వెంత అమాయకురాలివమ్మా. ప్రతి విషయం మగవాళ్ళకు చెప్పకుంటారా ! మొగుడికి తెలియకుండా, ఆడది ఎప్పుడయినా కొంత డబ్బు దాచుకోవాలి. ఎప్పుడు ఏ అవసరంవస్తుందో! మీ మంచికోరి చెబుతున్నాను. మీరు నా కూతుళ్ళాటివాళ్ళు. పది నెలలు తిరిగేసరికి, మీరు వెయ్యి రూపాయలు కూడబెట్టుకోగలుగుతారు. ఆ డబ్బుతో ఏ నగో నట్రో చేయించుకోవచ్చు. నువ్వుపొదుపు చేసిన డబ్బు, మీవారికి చూపితే ఆయనా సంతోషిస్తారు."

ఆలోచించగా వినూత్నకుకూడా చిట్టెమ్మగారి మాటలు నిజమే ననిపించాయి. "సరే నండీ ! ఈ నెల సుజాతతో పాటు, నేను కూడా వంద రూపాయలు కడతాను" అంది.

ఇద్దరూ చెరో వందా తెచ్చి, చిట్టెమ్మగారి చేతిలో పెట్టారు ఆ డబ్బు తీసుకుని ఆమె వెళ్ళిపోయింతర్వాత "నెలకు వంద రూపాయలు కట్టాలంటే నెల చివరలో

డబ్బుకు ఇబ్బంది పడాలేమో'' అంది వినూత్న.

''నెల చివరలో అంతగా డబ్బు అవసరం అయితే చిట్టెమ్మగారు సర్దుతుందిలే'' అని ధైర్యం చెప్పింది సుజాత.

*　　*　　*

ఆరునెలలు గడిచిపోయాయి. ప్రతినెలా, చెరో వందరూపాయలు, చీటీపాటకు చిట్టెమ్మగార్కి ఇస్తూనే ఉన్నారు. ఇద్దరికీ డబ్బుకు ఇబ్బంది లేదు కాబట్టి, ఇదరూ చీటీపాట పాడుకోలేదు

చీటీపాటకు నెలకు వందరూపాయలు మిగల్చటంకోసం, ఎన్నో చిల్లర ఖర్చులతో బాటు, రోజూ కొనుక్కునే పావలా పూలు కూడా కొనుక్కోవటం మానేసింది సుజాత. చీటీపాటకు డబ్బు కడుతున్న విషయం ఇద్దరూ మగవాళ్ళకు చెప్పలేదు.

వినూత్న భర్త రవికి ఒక నెల జీతం రాలేదు. అయిదోతారీఖు తప్పనిసరిగా చీటీపాటకు వందరూపాయలు కట్టాలి. సుజాత దగ్గర తీసుకుందామన్నా, అన్ని ఖర్చులు పోను ఆమె దగ్గర కూడా అంతడబ్బు మిగలదు. వినూత్నకేం చెయ్యాలో అర్థం కాలేదు.

చిట్టెమ్మగారి దగ్గరకు వెళ్ళి వంద రూపాయలు అప్పు అడిగింది వినూత్న.

''అయ్యో! ఇప్పుడు నా దగ్గర పది రూపాయలు కూడా లేవమ్మా రెండురోజులు ముందుగా అడిగితే, రెండు వందలయినా ఇచ్చేదాన్ని. ఇప్పుడెలాగమ్మా? అయిదోతారీఖు తప్పనిసరిగా చీటీపాటకు డబ్బు కట్టాలి. లేకపోతే పదిమందీ గొడవచేస్తారు'' అంది.

ఆ మాటకు వెన్నులోనుంచి వణుకు పుట్టుకు వచ్చింది వినూత్నకు వెయ్యి రూపాయలు, మిగలకపోతే మిగలకపోయింది. అనవసరంగా ఇటువంటి ఊబిలో ఇరుక్కుపోయానే అని మనస్సులో ఎంతో బాధ పడింది.

''ఒక పని చెయ్యమ్మా. ఏదయినా ఒక బంగారు వస్తువుంటే ఇవ్వు. నాకు తెలిసినామె దగ్గర పెట్టి డబ్బు తెస్తాను. చీటీపాట వంద కట్టి, మిగతా డబ్బు జీతాలు రాలేదు అంటున్నావుగా నెల ఖర్చుకువాడుకో. మళ్ళీ మీవారి జీతం డబ్బు అందగానే గుట్టు చప్పుడు కాకుండా డబ్బు తెచ్చివ్వు. నీ వస్తువు నీ కందిస్తాను. నలుగురిలో పరువు పోగొట్టుకునేకంటే ఇది మంచి పద్ధతి కదా?'' అంది.

## చిట్టెమ్మగారు

అంతకంటే చెయ్యగలిగిందేం లేక, బంగారు వస్తువులు చిన్నవి తన దగ్గరేం లేకపోవటం వలన, చేతికున్న లావుపాటి బంగారు గాజు తీసి, చిట్టెమ్మగారి చేతిలో పెట్టింది వినూత్న.

నెల గడిచినా, చీటీ పాటకు వంద రూపాయలు పోను, మిగతా డబ్బు చిట్టెమ్మగారు వినూత్నకు ఇవ్వనేలేదు. మొహమాటం కొద్దీ, వినూత్న కూడా అడగలేక పోయింది. ఒక రోజు వచ్చి, గాజు తాకట్టు పెడితే లేదంటే లేదని మూడు వంద లిచ్చింది. రెండునెలలకు గాను రెండు వందలు చీటీ పాటకు పోగా మిగిలిన వందా, రెండు నెలల పాట లాభం ఇరవయ్యి రూపాయలు తీసుకోమ్మా'' అంటూ నూటఇరవయ్యి రూపాయలు వినూత్న చేతిలో పెట్టి వెళ్ళింది.

ఒకటి, రెండుసార్లు రవి ఆఫీసు నుంచి ఇంటికి వచ్చేసరికి, తన ఇంట్లో నుంచి వస్తూ చిట్టెమ్మగారు గుమ్మం దగ్గర ఎదురయింది. ఆమె చేసే వ్యాపారాలన్నీ అతనికి తెలుసు కాబట్టి, ఆమెఅంటే మంచి అభిప్రాయంలేదు అతనికి. ఒకరోజు వినూత్నను, ఆమె మనింటికి విందుకొచ్చింది అని అడిగితే, ఇరుగూ,పొరుగు అన్న తర్వాత రాకుండా ఎలా ఉంటారు అంటూ కప్పుమంది తర్వాతెప్పుడూ అత ఆమె విషయం వినూత్న దగ్గర ఎత్తలేదు.

చిట్టెమ్మగారింటికి వెళ్ళిన సుజా భోరుమంటూ ఏడుస్తూ ఇంటికి తిరిగొచ్చింది ఆమెందుకు ఏడుస్తోందో వినూత్నకు అర్థ కాలేదు తరిచి, తరిచి అడిగితే కారణ చెప్పింది. సుజాత చెప్పిన విషయం వినగా వినూత్నకు గుండె ఆగినంత పనయ్యింది

చిట్టెమ్మగారు, చీటీపాట పేరుత అందరిదగ్గరా పోగుచేసిన డబ్బు, తాకట్టు పెట్టుకున్న బంగారంతోబాటు, రాత్రికి రాత్రి పరారయిపోయింది ఆమె నడిపే చీటీపాటల ఇంకా నాలుగయిదు ఉన్నాయంట మొత్త డబ్బు పాతికవేల ఉంటుందని అంచనా.

''పూలు కూడా కొనుక్కోవటం మానేసి ఎనిమిది వందలు ఇచ్చాను'' అంటూ ఏడుస్తూ చేతుల్లో ముఖం దాచుకుంది సుజాత.

రెండు తులాల బంగారపు గాజు కూడా ఆమె దగ్గరే ఉందన్న విషయం, అప్పుడ గుర్తుకు వచ్చి కరెంట్ షాక్ తిన్నదానిల కొయ్యబారి పోయింది వినూత్న.

''గాజేదని ఆయన అడిగితే, ఏమని సమాధానం చెప్పను? కట్టిన ఎనిమిది వందలతో బాటు, రెండు తులాల బంగారం కూడా పోయింది'' అంటూ ఏడుపు మొదలు పెట్టింది వినూత్న ఇద్దరూ ఒకర్ని ఒకరు ఓదార్చుకునే స్థితిలో లేరు.

ఇద్దరూ సుజాతా వాళ పోర్షనులో కూర్చుని మాట్లాడుకుంటున్నారు. తల నెప్పిగా ఉండటం వలన ఒక గంట ముందుగా ఇంటికి వచ్చిన భర్తను వినూత్న గమనించనే లేదు. వీళ్ళిద్దరి మాటలు విన్నాడు ఏం తెలియనట్టుగా, బయటకు వెళ్ళిపోయాడు.

*　　*　　*

హుషారుగా ఈల వేసుకుంటూ, ఇంటికి వచ్చాడు రవి. దిగులుగా ఉన్న వినూత్న ముఖం చూసి ఏం తెలియనట్టుగా ''ఎందుకలా వున్నావు? వంట్లో బాగలేదా?'' అడిగాడు మృదువుగా.

''ఏం లేదండీ. కొంచెం తల నెప్పిగా ఉంది, అంతే.'' భర్తకు టీకప్పు అందిస్తూ, మనస్సులోని బాధను ముఖంలో కన్పించనీయకుండా జాగ్రత్త పడుతూ అంది—

''తలనెప్పిగా ఉందా? అయితే శకుంతలలో

### మృత్యుంజయుడు

నా చెమట నాకు తైలం
నేను కష్టించే దీపాన్ని—
నా పనినాకు ఇంధనం
నేను అలుపురాని ఇంజన్ని—
నేను వంటరినికాను
నా ఆశ తోడు ఉంది.

### ప్రేమ

దొంగని ఆరాధిస్తున్నావా?
వెల్తిలో బరువుని చూస్తున్నావా?
తరచి తరచి నీ జ్ఞాపకాల్ని
తవ్వుకుని శోకిస్తున్నావా?
పదిమందిలో వంటరితనం
వంట్లో వందమంది నడుస్తున్నవడి
అనుభవిస్తున్నావా?
అయితే...అయితే...అది—
అమ్మాయి దూరిన మది.

— నీలాప్రియ

## చిట్టెమ్మగారు

నిప్పులాంటి నిజం అనే పిక్చర్ ఆడుతోంది. తలనెప్పిగా వున్నప్పుడు సినిమాకో, షికారుకో వెళితే తగ్గిపోతుంది. టయమవుతుంది. త్వరగా బయలుదేరు'' హడావుడీ చేస్తూ అన్నాడు రవి.

" చీర మార్చుకుని, బొట్టు పెట్టుకొని తయారయి వచ్చింది. ఎడమచేతికి వాచీ పెట్టుకుంది. కుడి చేతికి ఆకుపచ్చరంగు మట్టిగాజులేసుకుంది.

''మట్టిగాజులేసుకున్నావెందుకు? బంగారపు గాజుందిగా వేసుకో.''

''చీరకు మ్యాచ్ అవుతాయని, మట్టి గాజులు వేసుకున్నానండీ'' కంగారును కప్పి పుచ్చుకుంటూ అంది వినూత్న.

అప్పటికీ, భార్య తనతో నిజం చెప్పక పోయేసరికి చిర్రెత్తుకొచ్చింది అతనికి. ''ఎరుపురంగు చీరకు, ఆకుపచ్చరంగు గాజులు మ్యాచ్ అవుతాయా? వినూత్నా! చిట్టెమ్మ గారి దగ్గర తాకట్టు పెట్టిన, బంగారపు గాజు విడిపించుకోనేలేదా?'' అన్నాడు తీక్షణంగా వినూత్నవైపు చూస్తూ. భర్త మాటలకు గతుక్కుమంది వినూత్న. కన్నీటితో ఆమె చెంపలు తడిసిపోతున్నాయి. రవి ఆమెను ఓదార్చను కూడా ఓదార్చకుండా చూస్తూ నిల్చున్నాడు. భర్తకు నిజం తెల్సిపోయిందన్న భయంతో ఏడుస్తూ జరిగిందంతా భర్తతో చెప్పింది.

అంతా విన్న తర్వాత, రవికి భార్యమీద కోపం రాలేదు. ఆమె అమాయకత్వానికి అతనికి జాలేసింది.

ఆమెను చేతుల్లోకి తీసుకుని, లాలనగా తనచేత్తో ఆమె వీపుమీద నిమురుతూ ''ఆవిడ చీరలు తెచ్చి, నీకు లాభం తీసుకోకుండా అమ్ముతుందనుకున్నావా? తెలివయిన ఆడవాళ్ళు ఇంట్లో కూర్చుని చేసే వ్యాపారాల్లో ఈ చీరల వ్యాపారం ఒకటి. ఆవిడ ఒక్కో చీరమీద కనీసం పది రూపాయ లయినా మీ దగ్గర లాభం తీసుకుంటుంది. ఆమె ఒక్కో చీర ఎంత ఖరీదుకు తెస్తుందో మీకేం తెలుసు? ఆవిడ దగ్గర అప్పుచేసి చీరలు కొనవలసిన అవసరం ఏముంది నీకు? నువ్వు చీరలు కొనుక్కుంటానంటే, నేను కాదంటానా? జీతం రాగానే షాప్‌కెళ్ళి నీ కవసరం అయిన చీరలు తెచ్చుకోవచ్చుగా?

## అభిలాష!

కొత్త కీర్తి
కెరటాల వీపు
మీద కెక్కి స్వారీ
చెయ్యాలని తెగ
ఉబలాట
పడుతూంది మనస్సు!
దొంగ తిమింగాలాలుం
టాయని ప్రక్కదెబ్బ
తీస్తాయని ఒక
ప్రక్క భయం
పీకుతూ వున్నా
పెంకి గుఱ్ఱం లాంటి
కొత్త కెరటాల
శిఖరాగ్రాల మీద
ఉద్వేలంగా
ఉరకలు వెయ్యాలంటుంది మనస్సు!

– వీ రా జీ

మనిషెప్పుడూ వున్నదానితో సంతృప్తి చెందాలి గానీ, అత్యాశకు పోకూడదు. నెలకు ఆవిడ కిచ్చిన వందా నీపేర పోస్టు ఆఫీసులో వేసుకో వచ్చుగా? వినూత్నా! భార్యా భర్తల మధ్య ఏటువంటి చిన్న విషయాలలో కూడా అరమరికలు ఉండకూడదు. మూడు-వెయ్యి రూపాయలు పొదుపు చేద్దాం అనుకుని నాలుగువేలు నష్టపెట్టావు. నీలాంటి అమాయకులను మోసం చేసి, డబ్బు సంపాదించుకొనే ''చిట్టెమ్మ'' లాంటి వాళ్ళు ప్రతి ఊళ్ళోనూ ఉంటారు. అలాంటి వాళ్ళు ఊరికోరకమయిన అవతారం ఎత్తుతుంటారు. ఇలాంటి పిచ్చి పనులు ఇంకెప్పుడూ చెయ్యకు'' అన్నాడు మృదువుగా.

''ఈ ఒక్కసారికి నన్ను క్షమించండి. ఇంకెప్పుడూ ఇలాంటి పొరపాటు పనులు చెయ్యను.'' భర్త గుండెలకు హత్తుకుపోతూ అంది వినూత్న.

''జరిగిపోయిందాన్ని గురించి ఆలోచించి మనస్సు పాడుచేసుకోకు. పిక్చర్‌కు టయమవుతోంది వెళదాంపద'' ఆమె కన్నీరుతుడుస్తూ లాలనగా అన్నాడు.

తేలికపడిన మనస్సుతో, ''అర్థం చేసుకోగల రవి లాంటి సహృదయుడు తనకు భర్తగా లభించటం తన అదృష్టం'' అనుకుంటూ, భర్తను అనుసరించింది వినూత్న.




"లల్లీ, ఆఫీసునుంచి నువ్వొచ్చి గంటైనా ఇంకా కాఫీ తయారు చేయలేదా?" అడిగాడు అప్పుడే ఆఫీసునుంచి వచ్చిన మధు.

"................"

"నీకేం, పలక్కుండా బెల్లం కొట్టినరాయి మాదిరిగా వున్నావేం?" కుర్చీలో రాణి దర్జా ఒలకబోస్తున్న లలితను చూచి కోపంతో. "అయితే నన్నిప్పుడేం చేయమంటారు?" ఎదురు ప్రశ్న వేసింది లలిత.

"లల్లీ! వయసు పెరిగేకొలది నీకు కొంచెమైనా ఇంగితజ్ఞానం అన్నది పెరక్కుండా పోయింది." తన విసుగు ధోరణిలో మొదలెట్టాడు.

"అయిందా కామెంట్? లేకా ఇంకా యేమన్నా చదవవలసిన కామెంటరీ వుందా?" మరింత విసుగు ధోరణిలో విడిచి పెట్టింది బాణం తాటి చెట్టంత ప్రమాణం లేచాడు మధు.

"లల్లీ! ఆఫీసు నుంచి అలసి వచ్చిన నాకు నువ్విచ్చే మర్యాదిదా?" "నేను మాత్రం ఆఫీసు పని చేసి రాలేదా యేంటి? మీకుమల్లే మా ఆఫీసులో కొండంత పనిచేసి వచ్చాను. ఆ కాఫీ యేదో మీరు చేస్తే మిగతా పనులు నేను చేస్తాను."

"నోర్మూయ్! ఏదో వాగాలనుద్దేశ్యంతో తప్పిస్తే కాని, పనిచేసి చూపిస్తే సరిపోలా?" అదే నేను అంటా అంది లలిత. మధు విసుక్కుంటూ సిగరెట్టు కాల్చడానికి వరండాలోకి పోయాడు. అర్ధగంటైనా కాఫీ వచ్చే సూచనలు కనపడలేదు. మధు వంటింటివైపు దారి తీసాడు. వంటింట్లో లలిత లేదు. మంచంమీద వాలి ఆ వారం పత్రిక చదువుకొంటోంది.

కంయ్‌మని చంటాడు ఆరున్నొక్కరాగం అందుకొన్నాడు. పాప వస్తువులు తీసాడని రెండు వాడి వీపుమీద తగిలించింది. అసలే చిరాకులో వున్నాడు. ఇదొక చిరాకు. లలిత పులక్కుండా పత్రికా పఠనంలో నిమగ్నమై పోయింది. "లల్లీ! బాబు ఏడుస్తున్నాడు! చూడరాదా?"

జవాబు శూన్యం. కనీసం పత్రిక ప్రక్కకు తప్పించే ప్రయత్నం చేయలేదు.

ఎందుకో మధుకు బాబుని చూస్తే జాలేసింది. పాప దగ్గర ఆట సామానుతీసి బాబుకిచ్చాడు. ఈసారి పాప ఏడుపు మొదలు పెట్టింది.

విసురుగావచ్చింది లలిత. "మీమగవాళ్ళంత యింతే — వాడు మగవాడు కదా అని వాడి దాని దగ్గర సామానంతా ఇచ్చేశారు. ఏం కాస్సేపు ఏడిస్తే వాడి మూట తరి పోతుందా?"

"అబ్బబ్బా లలితా నీతో వేగలేక చస్తున్నాను. పాపకంటే నాకు బాబు ఎక్కువనుకున్నావా? ఇద్దరూ నా రెండు కళ్ళు." లలిత వంటింటివైపు అడుగు వేసింది. కాస్సేపు పోయాక వంటింటివైపు నడిచాడు. స్టవ్ మీద నీరు మరుగుతోంది. కాఫీ ఇప్పటికైనా తయారుచేస్తుందనిసంబరపడ్డాడు. మరొక్క సిగరెట్టు తగలేశాడు. కానీ కాఫీ వచ్చే జాడ అగుపించలేదు. మరొక్కసారి వంటింటివైపు అడుగువేశాడు వేడినీటిలో బాబుకి అమూల్ ప్రే కలుపుతోంది. ఒక్కసారిగా కోపం తారాస్థాయినందుకొంది.

"ఏం లలితా! ఇప్పుడైనా కాఫీ చేస్తావా! లేదా?" ఇంటికప్పు ఎగిరిపోయే టట్టంత కేకవేశాడు.

"అంత 'ఇది' గావుంటే తమరు తయారు చేసుకోవచ్చు. నేనేం దాసీదాన్ని కాదు, అణగి మణిగి వుండడానికి. మీలాగా నేను కూడా

ఆర్తిస్తూన్నాను.'' మతిపోయినంత పనైంది. రోజూ ఇలా ఈ మాదిరి చిన్న చిన్న తగువులాడుకోవడం వాళ్ళిద్దరికీ పరిపాటే. కాని ఇంత "డెలిబరేట్"గా మగవాడ్ని, అందులో పది హేనువేలు తీసుకొని మెడలో తాళి కట్టిన భర్తని "అహం" అడ్డొచ్చిందె మళ్ళా అడగడానికి. రోడ్డుమీద "నాయర్ హోటల్"లో కాఫీ త్రాగడానికి బయలుదేరాడు

. రాత్రి ఎనిమిదింటికి ఇల్లు చేరాడు పెద్దవాడు "హోంవర్కు"తో కుస్తీలు పడుతున్నాడు. చంటివాళ్ళిద్దరూ నిద్రపోయారు. మెల్లగా వంటింటివైపు దారితీశాడు పొయ్యిమీద కూర ఉడుకుతున్న వాసన వేస్తోంది. దగ్గర్లోనే పత్రిక తీసుకొని చదువుతూ కూర్చున్నది. ఆ రాత్రి గడచిపోయినంత సంబరపడిపోయాడు మధు చిన్నగా దగ్గాడు.

"ఏం" అన్నట్లు తలెత్తి చూచింది.

"కిళ్ళీలకు, సిగరెట్లకు, టిఫిన్‌కు ఏంత తగలేశారు? ఇలా ఖర్చు తగలేస్తే ఇద్దరి సంపాదన సరిపోదుకదా, మీరు 'పార్టు టైం' జాబ్ చేయాల్సి వస్తుంది.''

"నీవు పత్రికలకు, కాస్మొటిక్స్‌కి తగలేయడం లేదా? అలాగే నేనూ కూడా" లలిత కాస్త గా వూరుకొంది. మధు గెలుపొందిన వీరుడులా "ఫోజ్" కొట్టి లుంగీ కట్టుకొందుకు వెళ్ళిపోయాడు.

భోజనం దగ్గర మౌనం దోబూచులాడింది. ఒక్కసారిగా ఇద్దరి కళ్ళు కలుసుకొన్నాయ్. ఉక్రోషంతో లలిత మనస్సు ఉడికిపోతోంది, అతన్ని ఏలాగయినా దెబ్బ తీయాలని.

"కొళాయి నీళ్ళు ఈ రాత్రికి ఎక్కువగా పట్టాలి. నరసమ్మ బట్టలుతుకుతుందట. ప్రక్కింటి మంగతాయార్ని బతిమలాడాను, ఈ దినం మనం నీళ్ళు పట్టుకోడానికి ఛాన్సు కాబట్టి బద్దకించకుండా మీరు చేయాలి. నాకు నడుము నొప్పి పెడుతోంది. లేకపోతే........'' మధ్యలో ఆగిపోయింది.

"అయితే రామబాణం వేశావన్నమాట. అంతమంది ఆడవాళ్ళ మధ్య నేను రాత్రి మూడింటికి నీళ్ళు పట్టాలా? నీకు మతి పోయిందా యేమిటి?''

"ఏం మంగతాయారు వాళ్ళాయన ,లక్ష్మి భర్త, ఆ ప్రక్కింటి స్టూడెంట్ పట్టటం లేదా? కాదూ కూడదంటే; బాబు బట్టలు- మీ బట్టలు మాపి అలాగే వుంటాయి''అనేసి జవాబుకు ఎదురు చూడకుండా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

తెల్లవారింది, కాఫీలు త్రాగడం పూర్తి అయ్యాయి.

"నీళ్ళు కాగాయి, పిల్లలిద్దరికి స్నానం చేయించండి నేను వంట చేయాలి.''

"అబ్బా లలితా! నేను లెటిన్‌కు వెళ్ళాలి. ఆ పని నాకంటగట్టకు.'' కన్నుల లేచింది-- "ఆఫీసులోపని ఈ విధంగానే జేస్తారేంటి?" సరుసలేచి బరబరమంటూ పిల్లలిద్దర్ని లాక్కుంటు బాత్‌రూమ్‌వైపుకు పోయాడు. లలిత నవ్వుకొంది. గాభరాగా నరసమ్మ వైపు తిరిగి వంటపాత్రలు కడగటం అయిందేమోనని వెళ్ళింది. నరసమ్మ తన వైపు విచిత్రంగా పరికించి చూచింది

"ఏంటమ్మగోరు! అయ్యగార్ని పట్టుకొని పొద్దున్నే దులిపేస్తున్నారు? మీ ఇద్దరూ ఇలా తగవులాడుకొంటూంటే పిల్లలు పాడైపోరా??" తనకు తెలిసిన జ్ఞానాన్ని వొలకబోసింది. లలితకు ఒళ్ళు మండుకొచ్చింది. "అంటు తోముకొనేది, నాకు నీతులు నేర్పేటి నేర్పరితనం వచ్చిందా?" మనస్సులో "అహం" కొట్టొచ్చినట్లు అలముకొంటె "నరసమ్మా! నీపనినీవు సక్రమంగా చేసుకొంటే నీకు బాగుంటుంది. తగుదునమ్మా అని ఇతరుల మధ్య దూరడం అనేది అంతగా బాగోదు" అంటూ వంటపాత్రల్ని గభాల్న పట్టుకొని వంటింటి వైపు పోయింది. నరసమ్మ కోపం పాత్రలపై చూపించింది. "చదువుకొన్నాళ్ళమని మిడిసిపాటు తప్పితే ఆలోచించే గానం బొత్తిగా వుండదు" పైకి వినిపించాలనే అంది. మధుకేమో ఆ మాటలు సూటిగా శూలాల్లా గుచ్చుకొన్నాయి. లలిత ఇదొక లెక్కా అన్నట్లు పట్టించుకోలేదు.

ఇదే మాదిరి వాళ్ళ జీవితం ఒడుదుడుకులతో చుక్కాని లేని నావ మాదిరి పయనిస్తోంది.

ఆ రోజు ఆదివారం- ముందు రోజే "ప్లానింగ్" అయిపోయాయి. మరుసటి దినం సినిమా ప్రోగ్రామ్ ఉంది. కాదు నాకు వేరే పనుంటే చూడాలని. "ఆపని ఇనిస్టిట్యూట్‌లో పేకాట ఆడటమేగా. కాబట్టి ఈ రోజు నాతో సినిమాకు రావడం తప్పదు" అని పంతం పెట్టుకొన్నది. మేట్నీ చూచి రిక్షాలోంచి ఇంటి దగ్గర దిగుతుండగా మంగతాయారు, లక్ష్మితో గుసగుసలు పోవడం ఇద్దరూ చూశారు

మధు వాటిగురించి అసలంతగా పట్టించుకోలేదు. కాని ఆడది స్త్రీ బుద్ధి కాబట్టి వాళ్ళేం మాట్లాడుకుంటున్నారో వినాలనే కుతూహలం పెరిగింది. ఇంట్లోకి వెళ్ళుతున్నట్లుగా భర్తకు కనిపించి గోడచాటున పొంచి ఉండి వినసాగింది లలిత.

"మా గొప్ప సంబడం, ఇద్దరూ ప్రతి చిన్న విషయానికి చంటి పిల్లలమాదిరి కీచులాడుకొంటారు'' అంది మంగతాయారు.

"సహజమేకదండీ! భార్యభర్తలన్నమీదట ఏదో తగువులాడుకోవడం'' అంది లక్ష్మి

"అవున్రాయా! వీరి కొత్తకాపురం కనుక సరిగ్గా అలాంటి వాటిగూర్చి తెలియదు. ముగ్గుర్ని కన్నారు ఉద్యోగాలు వెలగపెడుతూ నా... మొగుడ్ని ...చేయమనటం, తనే మొగుడ్ని మించినపాటి ఉద్యోగం చేసి అలసిపోవడం ఏంటో పిల్లల్ని, మొగుడ్ని సరిగ్గా చూసుకోలేని ఆడది ఒక ఆడదా?'' అంది సాగదీస్తూ.



# లల్లి—మధు

"ఆ మాటకొస్తే అతనిలాగే ఆమె కూడా ఉద్యోగం చేస్తోంది కదండీ. తగువులాడుకోకుండా సక్రమంగా కలిసి మెలసి ఇంటి పనులు చేసుకుంటే ఎంతో బాగుంటుంది కదా"

తనను సమర్థిస్తూంటే లక్ష్మీమీద గౌరవం మనస్సులో గూడు కట్టుకోసాగింది. "ఆమె తనకంటే చిన్నది. ఆరిందలా మాట్లాడుతుంది. తనెంత అతనితో రాజీపడదామనుకుంటె ఆయనేమో నాతో 'కోపరేట్' చేయడు" అని తన తప్పేమీలేనట్లు మనస్సును నొక్కేసింది.

"అమ్మాయి! నీకు తెలియదుగాని వీళ్ళిద్దరి మీద ఆ పనిమనిషి నరసమ్మ వెయ్యిరెట్లు నయమనుకుంటాను. ఆమధ్య ఒకసారి వీళ్ళిద్దరూ తగవులాడుకొంటుండగా ఏదో తనకు తోచిన సలహా ఇచ్చిందట. దానికేమో ఆమె మీద విరుచుకుపడిందట. ఏమాటకామాట చెప్పుకోవాలి. నరసమ్మ మొగుడు వెంకన్న రిక్షాలాగుతాడా! వాడేదో సంపాదించుకొస్తాడా! వాడికి కావలసిన అవసరాలకు సరిపడా తీసుకొని మిగతాది పెళ్ళానికి పువ్వుల్లో పెట్టిచ్చినట్లుగా చేతిలో పెడతాడట. ఇదేమో మనలాంటి వాళ్ళింట్లో పాచిపని చేసి వాళ్ళిచ్చిన వాట్లతో సంసారం హాయిగా ఈదుకొస్తుంది. ఇదేమో ఉదయాన్నే ఇల్లు ఊడ్వడానికొస్తుందా. దీని మొగుడేమో పిల్లల్ని చక్కగా ముస్తాబుచేసి తన రిక్షాలో మ్యునిసిపల్ ఎలిమెంటరీ స్కూల్లో విడిచిపెట్టి తన బేరం చూచుకోడానికి పోతాడట. మధ్యాహ్నం ఇదేమో బస్సుస్టాండు దగ్గరున్న మర్రిచెట్టు దగ్గిరికి వీడికి భోజనం పట్టుకెళ్తుంది. వీళ్ళు చదువుకోని వాళ్లయినా వాళ్ళిద్దరిమీద ఎంతో నయమనిపిస్తారు. ఇద్దరూ సంపాదించి ఎంతో హాయిగా జీవితం సాగిస్తున్నారు."

లలిత రాలేదని వెనుకగావచ్చి మధు కూడా వాళ్ల సంభాషణగా పూర్తిగా విన్నాడు. ఆనాడు తామిద్దరు కీచులాడుకొంటుండగా నరసమ్మ "కామెంట్" చేసినట్లు "వీళ్లు చదువుకొన్న వాళ్ళమన్న మిడిసిపాటు తప్పిస్తే బొత్తిగా జ్ఞానం లేదు." వాళ్ళిద్దరిచెవుల్లో గింగిర్లు పెడుతున్నాయి! "నిజమే! నరసమ్మ, వెంకన్న సంస్కార విధానాలు మనిద్దరికంటె ఎంతో గొప్పవి" అని రాజీపడ్డారు.

## రాజర్షుల భోగానుభవం



మోక్ష ప్రాప్తికి సాధారణంగా కర్మయోగాన్ని గాని, జ్ఞానయోగాన్నిగాని అనుసరిస్తూ ఉంటారు. పూర్వం యోగాభ్యాసం బ్రాహ్మణ మునులు బ్రహ్మర్షులని, క్షత్రియులు రాజర్షులనే ప్రసిద్ధి. వసిష్ఠుడు మున్నగువారు బ్రహ్మర్షులు. జనకుడు, కేశిధ్వజుడు మున్నగువారు రాజర్షులు. బ్రహ్మర్షులు అడవులలో తపస్సు చేసుకొంటూ ఉండగా, రాజర్షులు ప్రజలను పాలిస్తూ రాజ్యాధికారులై ఉంటున్నారు. వారు రాజభోగాలు అనుభవిస్తూ ఉండేవారు. మహర్షులందరి లక్ష్యమూ ముక్తియే! అయితే- రాజర్షులు రాజభోగాలనుభవించడం దానికి విరుద్ధంగా లేదా? అనే ప్రశ్న కలగవచ్చును.

జన్మ యెత్తిన ప్రతి మానవుడూ చేసే పనులలో కొన్నిటివల్ల పుణ్యమూ, కొన్నిటివల్ల పాపమూ కూడా సంభవిస్తాయి. వాటి ఫలం పూర్తిగా ఆ జన్మలో అనుభవానికి రాదు ఆ కర్మలు ఏ మాత్రం మిగిలిపోయినా వాటి ఫలాన్ని అనుభవించడానికి మరొక జన్మ ఎత్తవలసి వుంటుంది. ఈ విధంగా ఆయా కర్మల ఫలం మిగులూ, తగులూ లేకుండా అనుభవానికి వచ్చేవరకూ ఎన్ని జన్మలనయినా ఎత్తవలసినదే! అట్టి స్థితి వచ్చినప్పుడే మోక్షం లభిస్తుంది. రాజర్షులకు అలాటి పరిస్థితి ఏర్పడడం అసాధ్యమే! అయినా తత్త్వ దర్శకులు అట్టి స్థితిని పొందగలరు. పొందగలమనే ధైర్యం వారికి ఉంటుంది. అట్టి ధైర్యశాలి జ్ఞానయోగం, కర్మయోగం ఎరిగిన కేశిధ్వజుడు ఒకడు.

కేశిధ్వజుడు రాజ్యాన్ని పాలించడంలో మిక్కిలి సమర్థుడు. అతను ఎన్నో దాన ధర్మాలూ, యజ్ఞయాగాదులూ చేసి ఎంతో పుణ్యం సంపాదించాడు. ఎరిగి ఏ పాపమూ చెయ్యలేదు. ఎరగకుండా చేసిన పాపం, అతని పుణ్య కర్మలవల్ల నశిస్తూ ఉంటుంది. అందువల్ల అతడు ఎక్కువ పుణ్యాన్నే సంపాదించాడని చెప్పవచ్చును. ఆ పుణ్యం క్షీణించి పోవడానికే అతడు రాజ భోగాలు అనుభవించేవాడు. ఫలాపేక్షతో కర్మలు చెయ్యకపోయినా, వాటివల్ల కలిగే పుణ్యం రానే వస్తుంది. భోగానుభవం వల్లనే ఆ పుణ్యం పూర్తిగా క్షీణించాలి. ఈ విషయాన్నే అతడు ఇలా చెప్పాడు.—

''అహం హ్యవిద్యాం మృత్యుం చ
తర్తుం కామః కరోమి వై,
రాజ్యం యాగాంశ్చ వివిధాన్
భోగైః పుణ్యక్షయం తథా.''

[విష్ణుపురాణం, షష్ఠాంశం, సప్తమాధ్యాయం.]

''నేను అవిద్యను, మృత్యువును తరించి ముక్తి పొందాలనే సంకల్పంతో ఎన్నో యజ్ఞాలను చేస్తున్నాను. వాటివల్ల కలిగే పుణ్యం క్షీణించడానికి రాజ్యభోగాలను అనుభవిస్తున్నాను'' అని దీని అభిప్రాయం.

రాజర్షుల రాజభోగానుభవంలోని తత్త్వం ఇది! భోగాలను అనుభవించకపోతే పుణ్యం క్షీణించదు.

— బులుసు వేంకటరమణయ్య

## ఉత్తరాలు

[5వ పేజీ తరువాయి]

### సినిమా

బైస్కోపు బాతాఖానీలో ''పాత సినిమాలు చూడరా బాబూ ?'' ప్రశంసనీయంగా ఉంది. నేటి మన తెలుగు చలన చిత్ర పరిశ్రమ దయనీయ స్థితిలో ఉన్నది. అశ్లీల సాహిత్యంతో, అసభ్య దృశ్యాలతో కలుషితమైపోయిన మన తెలుగు చిత్రాలు కుటుంబ సమేతంగా చూడనలవి కాకుండా ఉన్నాయి. ప్రయోజనాత్మకమైనవి, ప్రబోధాత్మకమైనవి నూటికీ— కోటికీ ఒకటి తప్ప మచ్చుకైనా కాన రావటంలేదు. నిర్మాతలు పక్కా వ్యాపార ధోరణితో నాలుగు డబ్బులు చేసుకుందామని చూస్తున్నారే తప్ప సమాజానికి సందేశాత్మక చిత్రాలు అందించడానికి ఎవరూ ప్రయత్నించడంలేదు. మన తెలుగు చిత్రాలకు తోడు మలయాళ సెక్స్ చిత్రాలు యువతరాన్ని మరింతగా పెడత్రోవ పట్టిస్తున్నాయి. సమాజానికి హానికరమైన ఇటువంటి చిత్రాలపట్ల ప్రభుత్వం కటినవైఖరి అవలంబించాలి. ''వోల్డ్ ఈజ గోల్డ్'' అన్న మన పెద్దల సూక్తికి మరింత బలాన్నిస్తూ, ఆసూక్తిని అక్షరాలా రుజువు చేస్తున్నాయి ఈనాటి మనతెలుగు చిత్రాలు. పాతచిత్రాలకు ప్రభుత్వం టాక్సులు మినహాయించి 'సినిమా లైబ్రరీ'లను ఏర్పాటు చేయాలన్న వీరాజీగారి సూచన ఆచరణయోగ్యమైనది. ఈ విషయంలో ప్రభుత్వం ఎటువంటి చర్య గైకొంటుందో వేచిచూడాలి.

టి.వి. శ్రీనివాసరావు, టి. సత్యప్రసాదరావు
(అండలూరు)

* * *

22—5—81 సంచికలో రెండు ప్రత్యేకమైన ఆకర్షణలు. మొదటిది తెలుగు చలనచిత్ర చరిత్రలోని నాటికి నేటికీ గల వ్యత్యాసాల గురించి శ్రీ వీరాజీగారి వ్యాసం. ముప్ఫై సంవత్సరాలకు పూర్వం తెలుగు చలనచిత్ర రంగం ఎన్నెన్నో అపూర్వ కళాఖండాలను సృష్టించింది. ఆదే రంగం ఈనాడు మచ్చుకుకూడా అటువంటివి చూపలేనిస్థితిలో పతనం అయిపోయింది. నాటి కళాఖండాల వివరాలూ, నాటి ఆదర్శాలూ ముచ్చటిస్తూ లోపభూయిష్టమైన నేటి చలనచిత్ర చరిత్ర వాతావరణంలోని వివరాలు ఎంతో ధైర్యంతో పేర్కొన్నారు. రెండోది తిరుమల రామచంద్రగారి వ్యాసం సాహితీ సంపన్నులైన వేదం వారి గురించి. తాత మనవల యొక్క అపూర్వ సాహితీ ప్రచురణ ప్రాభవాల వివరణ ప్రతిభావంతంగా ఉంది.

అంగిర వెంకట సత్యనారాయణరావు (ఏస్.ఎన్.పురం)

* * *

ఈ వారం శ్రీదేవి, అక్కినేని ముఖచిత్రంతో పత్రిక చాలా బాగుంది. పాతసినిమాలు చూడరా బాబూ వ్యాసం చాలబాగుంది. నిజమే పాత సినిమాల్లో ఉన్న హాస్యం, పాటలు, సాహిత్యం, నటన అన్నీ కొత్తవాటి మీద గొప్పవే. సాంకేతికంగాయిప్పటి సినిమాలు బాగున్నా మిగిలిన విషయాలు చెత్త, బోర్ ! అన్నీ ఒకటేరకం. అందుకు నిదర్శనం ఈమధ్యవచ్చిన 'త్యాగయ్య'. పాతది చాల బాగుంది. ఇక కథలన్నీ బాగున్నవి. చాగంటి శంకర్‌గారి కుర్ర వేధవా చాల బాగుంది. ఈ రోజుల్లో లంచాలు వాటి గూర్చి, అవి లేందే మనకి కావలసిన ఉద్యోగం రాదని చక్కగా రాశారు. బుణం కథ కూడా బాగుంది. ధనమూలమిదమ్ జగత్ అన్నారు పూరికేనా!

వై. లక్ష్మి (విజయవాడ)

### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన లందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు పెట్టడం అవసరం —సం.





# అవీ...ఇవీ...అన్నీ

## 1981 క్రోక్విల్ అవార్డుల పోటీ

ఆంధ్రప్రదేశ్ క్రోక్విల్ క్లబ్ ఆధ్వర్యాన రాష్ట్రస్థాయిలో తెలుగు కార్టూనిస్టులకు క్రోక్విల్ అవార్డుల పోటీ నిర్వహింపబడుతోంది. ఈ పోటీలో తెలుగు కార్టూనిస్టు లందరూ పాల్గొనవచ్చు. ఎంట్రీ ఫీజు లేదు. 1. అచ్చయిన కార్టూన్లు 2. కొత్త కార్టూన్లు 3. వ్యాఖ్యరహిత కార్టూన్లు అనే మూడు వివిధ తరగతుల్లో నిర్వహింపబడే ఈ పోటీ గడువు 15-6-81 నాటితో ముగుస్తుంది. 6×4 అం. సైజులో ఒక్కొక్క తరగతికి మూడేసి కార్టూన్లు పోటీకి పంపవచ్చు. ఇతర వివరాలకు ఈ క్రింది అడ్రసుకు వ్రాయండి.

కార్యదర్శి : ఆంధ్రప్రదేశ్ క్రోక్విల్ క్లబ్,
2-2-1109/5బి/4, బాగంబర్ పేట్,
హైదరాబాదు-500 013.

## జమీన్ రైతు స్వర్ణోత్సవ సంచిక

శ్రీ నెల్లూరు వెంకట్రామానాయుడుగారు రైతు ఉద్యమ పత్రికగా 1930లో స్థాపించి పరిపోషించిన జమీన్ రైతు ఆంధ్ర దేశంలోని ప్రముఖ వారా వార పత్రికలలో ఎన్న తగినదిగా 50 సం.లు నిరాటంకంగా సాగిన సందర్భంలో వెలువరించిన జమీన్ రైతు స్వర్ణోత్సవ సంచిక, మంచి వివరాలతో చక్కని గెటప్‌తో గడిచిన 50 సం.ల విశేషాలతో వెలువరించిన సంపాదకుడు శ్రీ నెల్లూరు శ్రీ రామమూర్తిని వారి సిబ్బందిని యిది చూసిన వారు హర్షించుతారు. వెల 5 రూపాయలు. ప్రతులకి జమీన్ రైతు కార్యాలయం, నెల్లూరుకి వ్రాయాలి.

## మహా ప్రవక్త మహమ్మద్

మహమ్మద్ ప్రవక్త కథను చక్కనితెనుగులో ఎస్. ఎం. మలి చెప్పినపుస్తకం యిది. దీనికిఆధారం హయాతె తయ్యిబాదీన్నితెలుగుఇస్లామిక్‌పబ్లికేషన్స్ 22—7—499పూరాణి హవేళీ, హైదరాబాద్—2 వారు వేశారు. వెల 12 రూపాయలు.


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**

# అన్నిటికన్నా తక్కువ ధరకు
# అన్నిటికన్నా ఎక్కువ శుభ్రత




ఇతర అన్ని డిటర్జెంట్ బార్‌లకంటే ఎంతో ఎక్కువ ఉత్తమమైనది, ఎంతో ఎక్కువ ఆదానిచ్చేది మరియు సబ్బులకంటే 1½ రెట్లు ఎక్కువ శక్తివంతమైనది.

## నీలి రంగు స్వస్తిక్
## డిటర్జెంట్ ఉతుకే బార్

ఒక మారు స్వస్తిక్ బార్...మరి ఎప్పటికీ స్వస్తిక్ బార్

Shilpi DM 9 A/80 Tel

Fun means

వారెవ్వా!
వహ్వ!
ఇదేమరి గో









ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ!
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాల చిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్సిన ముచ్చటైన
మురిపెపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.

గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...మజాయె మజా!